# ASOKUDU.

GENERAL EDITOR

M. R. RY. A. JAYARAM ROW PANTULU GARU B. A. L. T.,

HEADMASTER,

Taylor High School,

*NARSAPUR.*



SECOND EDITION 1000.



PUBLISHED BY

K. L. N. SOMAYAJULU,

PROPRIETOR,

**The Godavari Book Depot,**

*RAJAHMUNDRY.*

1920

B

# సూచీపత్రము.

# PREFACE.

There has been a great out-put of Telugu Works in recent years and yet an adequate supply of biographical literature has been a desideratum. This little book on Asoka, the Great Buddhist Emperor of India, is therefore a welcome addition to the small number of biographies in Telugu of Indian worthies, ancient or modern.

The purpose of a Biography, especially as one of the chief agents in influencing young minds, is too well-known to need any mention in this foreword. This book is, I believe, mainly intended for juvenile readers and I have no hesitation in saying that both from the point of the simplicity and lucidity of style in which it is written and the accuracy of facts, it is eminently suited to them.

It is written in short chapters, each dealing with either an episode of the story or the features of an important movement or the character of men and women of those times. Short, rippling sentences, full of power, animated descriptions of war, hunt and natural scenery, free from the usual taint of extravagance, delineations of character in their true historical setting and rapid narration where necessary, are some of the characteristics of style in this book. On the whole there is a happy blending of the new and the old methods of writing Telugu books.

The material for this short sketch has been drawn from the little volume on "Asoka" in "The Rulers of India" series. It must be said to the credit of the author

that in steering clear of the ugly stories connected with one of the queens of Asoka, Tishyarakshita, he has shown commendable discretion, and that so far as the main facts of Asoka's life and times are concerned, he has faithfully followed that book. The chief lessons from the life of that great Emperor that an ugly exterior can be a shell to intellectual and moral eminence, and that blood thirsty ambition can under the potent influence of a living faith and by divine grace through miracles, be transformed into humanitarian piety, have been brought out with such vividness that they cannot fail to make a deep impression on the mind of the reader.

When I have mentioned these outstanding features of the book, I have not exhausted all its merits. But I am sure I have said enough to commend the book to the Telugu reading public especially the student population. I trust the book will find a wide circle of readers, even without its being prescribed as an Examination pill.

I trust the gifted author will, ere long contribute more of such books and treatises on Scientific subjects to the Telugu literary world and lead it into healthy channels of reading.

At the special request of the Publisher, I have written this foreword in English,

NARSAPUR,
February 13, 1920. A. JAYARAM RAO B.A. L.T.,

శ్రీరామచంద్ర.

# అశోకుఁడు

## మొదటిప్రకరణము.

### దైవజ్ఞుఁడు.

ఇప్పుడు 1919 వ క్రీస్తుశకవత్సరము నడచుచున్నది. ఇప్పటి కించుమించుగ 2150 సంవత్సరములకుఁ బూర్వపు చరిత్రమునుగూర్చి వ్రాయుచున్నారము. భాగల్‌పురమునకుఁ బశ్చిమభాగమున గంగాశాఖానది యొకటి ప్రవహించుచున్నది. ఆనది పేరు చంపావతి—ఆనదియొడ్డుననే చంపకనగర ముండెను. చంపకనగరమునం దొక మహారాజు నివసించి యుండెను. ఆనగరమునం దనేక ధనవంతులును, వర్తకులును వాసము చేయుచుండిరి. ఆపట్టణ మతిలోకసుందర మైనది. రాజప్రాసాదములును, ధనవంతులసుందరసౌధములును, వారి విలాసోద్యానములును, వణిగ్వరుల యమూల్యవివిధవస్తుప్రపూర్ణము లగు విపణిశ్రేణులును గలసి యానగరసౌభాగ్యమును వర్ధిల్లఁజేయుచుండెను. ఆనగరమధ్యప్రదేశమున ధనవంతులకును దరిద్రులకునుగూడ ననుకూలముగ నుండునట్లు మహారాజ్ఞీమణి యొకప్రశస్తసరోవరమును బ్రతిష్ఠించి యుం

డెను. ఆసరోవరము నలువంకలను గలసమున్నతవిశాలతీరములు ఫలపుష్పాదుల శోభిల్లసితములుగఁ జేయించెను. మహారాజును, రాణియు, గొప్ప గొప్ప రాజోద్యోగులును, సంపన్న గృహస్థులును, ధనవంతులును, శ్రేష్ఠులగు వణిగ్జనులును, యశస్సు గోరుకుని, పుణ్యముఁ గోరుకుని, సాధారణజనులసౌఖ్యముఁ గోరుకుని బ్రాహ్మణులు యతులు మొదలగువారి ప్రీతికొఱకును నగరమధ్యప్రదేశమునను పురబాహ్యప్రదేశములను గూడ ననేక కూపములను, తటాకములను, చైత్యములను, మఠములను, మందిరములను బ్రతిష్ఠించి యుండిరి. అచ్చటిరాజు గుణవంతుల నాదరించుచుండెను; పండితగణములకు భూములను వృత్తులను గల్పించి వారిగౌరవోత్సాహములను వర్ధిల్లఁజేయుచుండెను. ఆమహారాజు దీనులదుఃఖములను, పీడితులకష్టములను దొలఁగించుట కనేకసౌకర్యములను గావించియుండెను. ఏనగరమున నిట్టి మహారాజు నివసించి యుండెనో, యెచ్చట నింతటిదానశీలురగు వైశ్యవంశులు వాసము చేయుచుండిరో, యేస్థానమునందుఁ గృషివాణిజ్యము లింతటియున్నతస్థానము నలంకరించి యుండెనో యట్టిపట్టణమున నానావిధంబు లగుజనసంఘములు వచ్చుచుఁ బోవుచుండె ననియు, ధనవంతులును, దరిద్రులునుగూడఁ గలసి నివసించుచుండిరనియుఁ జెప్పుటకంటె నింకను నాశ్చర్యకర మగువిషయ మేమున్నది?

ఆచంపకనగరమునఁ జంపావతీనదీతీరమునందు గలవిష్ణు

మందిర సామీప్యమునందుఁ గొంతమంది బ్రాహ్మణులు వాసము చేయుచుండిరి. అది వైశాఖమాసము—ఒక బ్రాహ్మణ కన్యక నదీజలముల స్నానముచేసి శుచియై భక్తిభావముతో మాధవుని బూజించుటకై దేవాలయమునకుఁ బోయెను. అచ్చట నవమల్లికాకుసుమములతోడను, దులసీదూర్వాంకురములతోడను, శ్వేతచందనాదికములతోడను మాధవుని బూజించి యాబాలిక మరల గృహాభిముఖియై వచ్చుచుండెను. ఆమె పచ్చని పట్టుచీరను ధరించియుండెను. ఆమె కపోలములు శ్వేతచందన చర్చితములై యుండెను. ఆబాలిక దక్షిణ కరంబునఁ జిన్నజలకలశమును, వామకరంబునఁ బూలపళ్ళెరమును గలదు. ఆబాలిక యతిత్వరితముగ వచ్చునపుడు దమ యింటిగుమ్మముకడ నొక యపరిచితుఁడు నిలువఁబడి యుండుటనుఁ జూచెను. ఆతఁడొక బ్రాహ్మణుఁడు—ఆతనిహస్తమునం దొక పుస్తకముండెను; గృహస్వామిని దర్శింపవలయునని యాతఁడచ్చట నుండి నిరీక్షించుచుండెను. ఆబాలిక నాతఁడు దూరమునుండియే చూచుచుండెను. ఆమె సమీపించినతోడనే యాబ్రాహ్మణుఁ డామెతో "నేనిచ్చట నిరీక్షించుచుంటినని నీజనకునితోఁ జెప్పుము" అనియెను.

బాలిక లోపలికిఁబోయి యాసంగతి తండ్రితోఁ జెప్పెను. గృహస్థుఁడు వెలుపలికివచ్చినతోడనే యాబ్రాహ్మణుఁ డాతనితోఁ దానొక వైద్యుఁడనని చెప్పెను. ఆ యిరువురకును నించుక సంభాషణ మైనంతట నావైద్యుఁడు "అయ్యా! మీరు

విచారముతో నున్నట్లగపడుచున్నా రేమి?" అని ప్రశ్నించెను.

గృహ—అందుల కాశ్చర్య మేమున్నది? వయసువచ్చి నబిడ్డ యింకను బెండ్లిగాకుండ నింట నున్నప్పుడే జనకుఁడు నిశ్చింతుఁడై యుండఁగలుగును? నేను దరిద్రుఁడను—నా కుమార్తెకుఁ దగిన యనుకూలవరుని నేనెట్లు తేఁగలుగుదును? రేయుం బవ లీవిషయమునుగూర్చియే యాలోచించుకొనుచు నిట్లుంటిని.

దైవ—అగు నామాట నిజమే. రాజులును, మహారాజులును, ధనికులును, గొప్పవారందఱునుగూడఁ దమకుమార్తెల ననుకూలవరులకుం గూర్చి కన్యాదానఫలము నందవలయు ననియే యపేక్షించుచుందురు. కాకేమి? మీ రెఱుంగియే యుందురు—జననమరణవివాహములు మూఁడును దైవాధీనములు? వివాహవిషయమునఁ గన్యకయదృష్టమే ప్రధానమైనది.

గృహ—అవును. అవి దైవాధీనములే. ఎఱుంగుదును. కాని ప్రయత్నముకూడ నావశ్యకమే కదా!

దైవ—సర్వవిషయములయందును గూడ దైవపురుషకారములు రెండు నావశ్యకములే. ఈమాట నెవ్వఁడు కాదనఁగలఁడు? కాని యదృష్టముమాత్ర ముపేక్షణీయము కాదు. ఏమైననేమి? మీకొక్కమాట చెప్పెదను—మీరు మీకుమార్తె వివాహవిషయమున నెంతమాత్రమును జింతింప నక్కఱలేదు.

ఇంతఁ అకు వారిరువురును నిలిచియుండియే సంభాషిం చుచుండిరి. దైవజ్ఞుఁ డిట్లు చెప్పినతోడనే గృహస్థుఁ డానం దించి యాతనిం దనతోఁగూడ లోనికిం దీసికొనిపోయి యొక చాఁపపైఁ గూర్చుండఁజేసెను.

ఇరువురును గూరుచుండిరి. పిమ్మట దైవజ్ఞుఁడు "మీ బాలిక నొకసారి పిలువుఁడు" అనియెను.

గృహ—అమ్మా! సుభద్రాంగీ! ఇటురమ్మా.

బాలిక యచ్చటకు వచ్చి తండ్రియానతిచే దైవజ్ఞ నకు నమస్కరించి యచ్చటఁ గూరుచుండెను.

దైవ—అమ్మా! నీ చేయొకసారి చూపుము!

బాలిక యించుకసిగ్గుతోఁ దనవామహస్తమును జాఁ చెను—చందనమలఁదిన చెక్కులును, దుమ్మొదలం గేరుపెన్నె ములును, సిగ్గునునుదొంతరలం దరళంబు లగు చెలువంపుఁ జూపులును నాబాలికసౌందర్యమునకు మనోహరత్వము నా పాదించుచుండెను. కోమలారుణపల్లవసదృశంబు లగుమృదు లహస్తములును, జంపకకోరకసన్నిభంబు లగురుచిరాంగుళు లును నామెయదృష్టమును జెప్పకయె చెప్పుచున్నవి—ఇఁక ఫలాఫలములు విశదీకరించుటకు దైవజ్ఞుఁ డేలకావలయును? ఆబాలికను జూచినతోడనే పరమేశ్వరుఁ డేదియో విశేషో ద్దేశముతో నీమెను సృష్టించి యుండునని బోధపడుచుండెను.

దైవజ్ఞుఁ డాబాలికహస్తమును బరీక్షించెను. ఆమె జన్మదినము, సమయము, లగ్నము మొదలగునవి తెలిసికొని

గణనము చేసి చూచెను. పిమ్మట ''అమ్మా! ఇఁక వెళ్ళుము!'' అనియెను.

ఒక్కగంతులో నాబాలిక తల్లియొద్దకుఁ బోయెను.

దైవజ్ఞుఁడాబాలికశుభలక్షణములంగూర్చి తండ్రికి విశదీకరించెను. మఱియు నీబాలికగర్భమునం దిరువురుపుత్రులు జనియింతురనియు నందొకఁడీవిశాలభూమండలమునకుఁ బ్రభుఁడగుననియు, రెండవవాఁడతిలోకప్రతిభానిధి యగు ధర్మమతబోధకుండగు ననియు గణించి చెప్పెను. ఆబాలిక శుభలక్షణప్రశంసయు, భవిష్యదైశ్వర్యప్రస్తావమును విని యామె తల్లిదండ్రులు మిగుల నానందించిరి. అప్పుడొక్కించుకసేపా బ్రాహ్మణుఁడు తన పేదతనమును మఱచిపోయెను. అప్పుడాతనిగృహిణి యాదైవజ్ఞునకు ''ఈదినమున మాయింటనే యాతిథ్యమును స్వీకరింపవలయును'' అని తెలియఁ జేసెను.

---

## రెండవ ప్రకరణము.

---

### బ్రాహ్మణసంపతులు.

ఆదరిద్రబ్రాహ్మణుని యిల్లు మిక్కిలి చిన్నదిగ నుండెను. గృహద్వారములును జిన్నవిగనే యుండెను. అందువలనఁ బైవారెవ్వరైన నింటికి వచ్చినప్పుడింటివారికి మిగుల ననుకూలముగ నుండును. దైవజ్ఞుఁడు శుభఫలములను జెప్పి

గృహ—ఇప్పుడు మనమేమి చేయవలయును?

గృహి—నేనేమి చెప్పఁగలను?

గృహ—ఎట్లో యొకవిధముగ నాలోచించి యేదైన నుపాయమును జెప్పుము!

గృహి—ఇంకను నుపాయమేమి? దేవుఁడు మనయెడల నెంతదయ కలిగియున్నాఁడు! మనసుభద్రాంగి నిజముగా మహారాజ్ఞి యగునా?

అని చెప్పుచుండఁగా నామె కన్నులలో నానందబాష్పములు మిలమిల మెఱయఁజొచ్చెను.

గృహ—మనసుభద్రాంగి పరమసుందరి—ఉమాసమానురాలు. అదృష్టవశమున నీమె నేనహారాజునకైన నుపాయనముగ నొసంగినచో నాఁడీమెను దనపుత్రిగఁ దనను గ్రహించుననుట యసంభవము కాదు. కాని యిట్టి దరిద్రబ్రాహ్మణునియింటికి మహారాజువచ్చునా?—వారికటాక్షావలోకనమెట్లు లభియింపఁగలదు?

గృహి—ఇక నేమియుపాయము?

గృహ—నేనీ చిన్నిబాలికను వెంటఁబెట్టుకొని మహారాజగు బింబిసారునిరాజధానికిఁ బాటలీపుత్రమునకుఁ బోయెదను. ప్రయత్నించెదను!—భగవదనుగ్రహముున్నచో మహారాజు శుభదృష్టి లభియించును.

గృహి—ఈ మూఁడుబిడ్డను వెంటఁబెట్టుకొని దూరదేశ

మునకుఁ బోవుట యేమంత మంచిది? ఇందును గూర్చి లోక మేమనుకొనును?

కృష్ణ— అనుకొననిమ్ము! ధర్మమును దైవమును సాక్షిగ నంచుకొని నేనీకార్యమునఁ బ్రవేశించెదను. నాచిత్తసుధ దగ్గమేలుకొఱకుఁ బనిచేయుచున్న నాకు లోకము వలని నిందాస్తుతులతో నిమిత్తము లేదు. నేను తప్పక పాటలీపుత్రమునకుఁ బోయెదను. ఈ ప్రయాణము శుభదాయక మగునని దైవజ్ఞుడు చెప్పయున్నాఁడు.

---

## మూడవ ప్రకరణము

### పాటలీపుత్రయాత్ర.

బ్రాహ్మణుఁడు తన భార్యతోఁ బాటలీపుత్రమునకుఁ బోయెద నని చెప్పినతరువాత నందులకుఁ దగినప్రయత్నములను జేయనారంభించెను.

అది వేసవికాలము—వైశాఖమాసము—సుడిగాలులు వీచుదినములు. నాకా యాత్ర కది మంచిసమయము కాదు. ఇంతే కాక విశేషమునఁ బోవలసి వచ్చినచోఁ బ్రయాణవ్యయమునకును గృహవ్యయమునకునుగూడ ధనము కావలయును. ఎట్లో యద్దియును సమకూర్చుకొనుట కాబ్రాహ్మణున కించుక యాలస్యమయ్యెను. ఆచంపకనగరమునందలి ధనాఢ్యుఁ డగునొకవర్తకుఁ డాతనికిఁ దగినసాహాయ్యము చే

చేసెదనని మాట యిచ్చెను. ఆశ్వీజమాసమునం దావర్తకుని పెద్దయోడ యొకటి వాణిజ్యవస్తువులం దీసికొని పాటలీపుత్రమునకుఁ బోవలసి యుండెను. బ్రాహ్మణుఁడు తనకు మార్గం దీసికొని యాయోడపై నెక్కిపోవుటకు స్థిరపఱచుకొనియెను.

క్రమముగ వర్షాకాలము వచ్చెను. నదీనదములు జలపరిపూర్ణము లయ్యెను. చంపావతీనది చిన్నదియేయయ్యు నిప్పు డుభయకూలములు నొరసి ప్రవహించుచుండెను. ఇప్పు డానదీతీరమునకుఁ జిన్నవియుఁ బెద్దవియుఁగూడ వర్తకనౌకలు వచ్చుచుఁ బోవుచుండెను. ఆశ్వీజమాసము వచ్చినది. బ్రాహ్మణుఁడు నిర్దిష్టదినమున సుభద్రాంగిని వెంటఁబెట్టుకొని యావర్తకుని యోడపై నెక్కి రాజధానికిఁ బ్రయాణమయ్యెను.

---

## నాలుగవప్రకరణము.

---

### పాటలీపుత్రము.

మహారాజగు బింబిసారుని కాలమున మగధరాజ్యమునకు రాజగృహము రాజధానిగ నుండెను. రాజగృహమునకు నలుదెసలను బర్వతపంక్తు లుండుటచే నానగరము శత్రుదుర్భేద్యమై యుండెను. రాజులు తమ రాజ్యరక్షణవిషయంబున నెప్పుడును నిర్విచారులుగ నుండఁజాలరు; ఎల్లప్పుడును దమ

రాజ్యమును విస్తరింపఁజేయవలయు ననియే ప్రయత్నించు
చుందురు. బింబిసారునిపుత్రపౌత్రులు తాము రాజగృహము
నందే యున్నయెడలఁ దమరాజ్యమును విస్తరింపఁజేయుటకు
ను, దామున్నతింబడయుటకును దగినంతయవకాశ ముండద
ని తలంపసాగిరి. క్రమముగా బింబిసారునిసంతతివారిదృష్టి
పాటలీపుత్రమువైపునకుఁ బ్రసరింపసాగెను. గిరిరాజదుహిత
యగుగంగయు, వింధ్యాచలసుతుం డగుహిరణ్యబాహువు
(శోణానదము)ను గలసికొన్న రమణీయస్థానమునఁ బాటలీ
పుత్రనగరము నిర్మింపఁబడియెను. శత్రువులకు దుర్భేద్య
ముగ నుండుటకును, రాజ్యము విస్తరించుటకును, నగరశోభ
యతిశయించుటకును, నాగరకులసౌకర్యమునకును, వాణిజ్య
ము వర్ధిల్లుటకునుగూడ నీనదీసంగమస్థానము సర్వవిధముల
ననురూపమై దని నిరూపింపఁబడియెను. చంద్రగుప్తు రాజ్య
కాలమునుండియుఁ, బాటలీపుత్రనామము దేశవిదేశములఁ
బ్రఖ్యాతిఁ బొందఁ దొడంగెను. ఆకాలమునందుఁ బాటలీపుత్ర
ము గంగాశోణసంగమస్థానమున శోణానదమున కుత్తరతీర
మునం దున్నట్లు తెలియవచ్చుచున్నది. కాలవశమున నిప్ప
టికా పాటలీపుత్రనగరచిహ్నముకూడ మనకు గపడుట లే
దు. ఉన్నను మన కది దుర్లభ్యము—

చంద్రగుప్తసార్వభౌముని కాలమునఁ బాటలీపుత్ర
సౌందర్యసమృద్ధివర్ణనమే లేకయున్నది. చంద్రగుప్తుని
రాజప్రాసాదము దారు నిర్మిత మైనది. ప్రాసాదప్రాచీరములు :

ను, స్తంభములును సమస్తమునుగూడ రమణీయదారునిర్మితములై యుండెను. గృహస్తంభము లన్నియును సువర్ణరజతద్రవములతోఁ జిత్రరూపమునఁ బూఁతలు పెట్టఁబడి యుండెను. విశాలాయతరమణీయోద్యానమధ్యమునం దారాజమందిరము నిర్మింపఁబడుటచే దానిశోభాసౌందర్యములు శతగుణాధికవిలసితములై యుండెను. ఆవిశాలప్రాంగణమధ్యమునం దచ్చటచ్చట సరోవరములును, జలయంత్రములును, పుష్పవాటికలును శోభిల్లు చుండెను. రాజధాని దృఢప్రాకారసమన్వితమై, యగాధపరిఘావేష్టితమై యుండెను. అసంఖ్యాకసైన్యముచే నానగరము సర్వదా రక్షింపఁబడుచుండెను. నగరము నందంతటను ప్రజాసుఖస్వాస్థ్యములకై యనేకవిధములగు సదుపాయములు చేయఁబడియెను. చంద్రగుప్తుని ప్రబలప్రతాపమును, రాజప్రాసాదశోభాసంపత్తియు, నగరసౌందర్యమును, సంపత్సమృద్ధియు, సకలవిషయానుకూలసమీకరణమును, సమీచీనశాసనమును గారణముగ నాపాటలీపుత్ర మాకాలమునందే కాక తరువాతఁ జాలకాలమువఱకును భారతవర్షమునందును విదేశములందునుగూడ విశేషవిఖ్యాతి నంది యుండెను.

చంద్రగుప్తసార్వభౌముని యనంతరము క్రీ॥ పూ॥ 297 వ సంవత్సరమున నాతని కుమారుఁడగు బిందుసారుఁడు పైశృకఁబడు పాటలీపుత్రసింహాసన మధిరోహించెను. క్రమముగ మహారాజగు బిందుసారుని ప్రతాపకీర్తులు సర్వదేశముల

యందును బ్రచారితము లయ్యెను.

చంపకనగరదరిద్రబ్రాహ్మణుండా బిందుసారుకీర్తి ప్రతాపములు నాలకించి విశేషముగ నాశపడి తనకుమారీరత్నమును వెంటఁబెట్టుకొని పాటలీపుత్రనగరమునకుఁ బ్రయాణమయ్యెను.

---

## అయిదవప్రకరణము.

---

### రాజదర్శనము.

ఆబ్రాహ్మణుండు తనకుమారీమణి నొకయెడ నుంచి తానొక్కరుఁడును బాటలీపుత్రనగరమునం బ్రవేశించెను. ఆపట్టణమునందలి సుప్రశస్తరాజపథంబులను, సుందరసౌధమాలికలను, మనోహరవస్తుపరిపూర్ణంబు లగువిపణిశ్రేణులను, నానాదేశజనసమూహములను జూచి యాదరిద్రబ్రాహ్మణుఁడు విస్మయవిభ్రాంతులకు లోనైపోయెను. ఎట్లో యాతఁడు నాలుగైదుదినములలో నగరమధ్యమునం దొకచోట నాశ్రయమును సంపాదించుకొనియెను. క్రమముగ నెంతయో ప్రయత్నించి రాజమంత్రి యగు రాధాగుప్తుని దర్శించి మహారాజసందర్శనము చేయింపవలయు నని ప్రార్థించెను. రాధాగుప్తుఁడు సదయహృదయుఁడై యాబ్రాహ్మణునకు రాజసందర్శనభాగ్యమును లభియింపఁజేసెద నని చెప్పెను.

నిర్దిష్టదినమున శుభముహూర్తమునం దాబ్రాహ్మణుఁ

డు రాజసభాంతరాళమునఁ బ్రవేశించెను. ఆబ్రాహ్మణుఁడు కొ్రత్తవాఁడు. రాజసభయందలియందఱు నాతని కపరిచితులు. ఒక్కమంత్రిమాత్రమాతఁడు కొంతసేపటికిఁ జూడఁ గలిగెను. ఆబ్రాహ్మణుఁడు గ్రంథములనుండి సభావర్ణనమును విని యుండెను. ఇప్పుడాతఁ డింద్రసభలోఁ బ్రవేశించితి నని యనుకొనెను. మహారాజమణి యగుబిందుసారుఁడు మాయూరసింహాసనమున నధివసించి యుండెను. అమాత్యు లమరులంబోలి యథాస్థానము నలంకరించియుండిరి. ఇంద్రచంద్రవాయువరుణాదులందఱు నాతనికొక్కచో నగపడుచున్నట్లుండెను. ఎవ్వరిని వదలి యెవ్వరిని జూడవలయునో యాతనికి బోధపడుటలేదు. ఎవ్వానినైనఁ దదేకదృష్టితో వింతగఁ జూచుచుండినచో నసభ్యజనోచితముగ నుండునేమో యని యాతఁడు సంకోచించుచుండెను. అప్పుడాతఁ డాశాదృష్టులతో మంత్రి యెచ్చట నుండెనో కనుపెట్టవలయు ననియు, నాతనికిఁ దన్నుఁ గాన్పించుకొనవలయు ననియు నలుదెసలఁ బరికించుచుండెను. ఎమ్మట నాతఁడు మంత్రిచేసన్నచే నించుక స్వస్థచిత్తుఁడై కూర్చుండియుండెను.

దైనిక రాజకార్యములు పూర్తియైనతరువాత రాజాజ్ఞచే మనవులఁ దెలుపుకొనవలసినవారొక్కరొక్కరుగ మహారాజసమ్ముఖమునకుఁ బోయి తమతమప్రార్థనముం దెలుపుకొని వెడలిపోవుచుండిరి. తుదకుఁ జాపకనగరబ్రాహ్మణుఁడుకూడ రాజసమీపమునకుఁ బోయి నిలువఁబడియెను.

బ్రాహ్మణుఁడు యథావిధిగ సార్వభౌము నభినందించి ధ్యానమును దూర్వాంకురములను నొసంగి యీవిధముగ నాశీర్వదించెను.

"నిగమమంత్రార్థసిద్ధి నీ • కగునుగాక!
అఖిలశత్రువినాశన • మగునుగాక!
ఆప్తబంధుమిత్రులకు మే • లగునుగాక!
ధనము, ధాన్యంబు, ధర్మంబు, • ధరణితలము
చిరతరాయుష్యము, సుఖంబు, • వరయశంబు,
వారణతురంగయానాది • వైభవంబు
భాసురాపత్యసిద్ధి సు • శ్రీసమృద్ధి,
అభిమతార్థోపలబ్ధి నీ • కగునుగాక!"

సార్వభౌముఁ డగుబిందుసారుని యమూల్యమణిమయకిరీటాలంకృతం బగునుత్తమాంగ మాదరిబ్రాహ్మణుని యాశీర్వాదపరిగ్రహణమునకై యించుక యవనత మయ్యెను. రాజాజ్ఞానుసారముగ నప్పుడా బ్రాహ్మణుఁడు "రాజపరమేశ్వరా! నాకొకకన్యారత్న మున్నది. ఆమె పరమరూపలావణ్యవతి; సకలశుభలక్షణసమన్విత—ఎందఱో దైవజ్ఞు లీమె రాజమహిషి యగునని వాక్రుచ్చియున్నారు. మహారాజా! నేనాకన్యకు జనకుఁడను. ప్రేమాతిశయమున నాశాలుబ్ధుఁడనై దేవరకు శరణాగతుఁడ నైతిని. ప్రభూ! అనుగ్రహించి నాకన్యను బరిగ్రహింపవలయును. ఇదియే యీదరిద్రబ్రాహ్మణుని వినయపూర్వకవిజ్ఞాపనము" అనియెను.

చక్రవర్తి యగుబిందుసారుఁడు స్త్రీరత్నం దుష్కులాదపి అనువాక్యమును స్మృతికిఁ దెచ్చుకొని యాకన్య నంతఃపురమునకుఁ బంపవలయు నని యాజ్ఞాపించెను. మంత్రియగురాధాగుప్తుఁడు రాజాజ్ఞను యథావిధిగఁ బ్రతిపాలించెను.

దరిద్రబ్రాహ్మణునిరాజసందర్శన మీ విధముగా ఫలియించెను.

---

## ఆఱవప్రకరణము.

---

### రాజాంతఃపురము.

బ్రాహ్మణుఁడు రాజాస్థానమునుండి తిరిగివచ్చి సుభద్రకు సమస్తవృత్తాంతమును దెలియఁజేసెను. భవిష్యత్సుఖచిత్ర మతిమనోహరమైనదే యైనను జిరకాలమువఱకుఁ దండ్రి తనయను విడిచి యుండుటయు, బాలిక తల్లిదండ్రులను విడిచి యుండుటయుఁ దటస్థించుటవలన నది విచారకరముగనే యుండెను. కన్నీరు భవిష్యత్సుఖప్రదర్శనమును దూరమునం దుంచిన నుంచుఁగాక! వర్తమానమునందైన నొండొరులు పరస్పరముఁ జూచుకొనకుండ నామార్గమున కడ్డము వచ్చి నిలిచినది! కొంతసే పీవిధముగఁ గడచిపోయినది. పిమ్మట నియమితసమయమున వాహనాదికవైభవములతో సుభద్రాంగి రాజాంతఃపురమునకుఁ దీసికొనిపోఁబడియెను.

అనంతర మాబ్రాహ్మణుఁడు పాటలీపుత్రముఁగొన్ని దినములు మాత్ర ముండి శూన్యహృదయుఁడై తనముద్దుబిడ్డ మహావైభవము ననుభవించును సుఖపడఁగలదనునాలోచనతో మరలఁ జంపకనగరమునకుఁ బ్రయాణ మయ్యెను. సుభద్రాంగి యప్పటినుండి పితృగృహస్మృతి, కల్పనములు, కథలు మొదలగు వానియందుమాన సంతుష్టినందును రాజాంతఃపురమునందుండి తల్లిదండ్రులు కించుకయు మాటను గల్పించుచుండెను.

ఎక్కడదరిద్రకుటీరము!—ఎక్కడి రాజాంతఃపురము! చిన్నగోరువంకను గులాయమునుండి విడఁదీసి శోభనప్రమోదోద్యానమందిరమున విశాలకనకపంజరమునందు బంధించినచో దానిమనోభావ మెట్లుండునో. సుభద్రాంగిమనోభావముకూడఁ జాలవఱకట్లే యుండెను. సుభద్రాంగిపుట్టినయింటిముంగిటివాఁకిలి చిన్నదియే—కాని యది యామెచిన్నిపాదములకును, లీలాతరళనయనయుగళంబునకును బరిమితస్థాన మైయుండలేదు. దానికి మారుగా నిప్పుడాబాలికకుఁ బ్రాకారవేష్టితప్రాసాదములును విశాలనోవరంబులును, జలయంత్రములును, పుష్పలతామనోహరవిశాలప్రాంగణంబులును లభియించి యున్నవి. కాని యివియన్నియు నామె కూపిరి త్రిప్పికొనుటకైన నవకాశము లేనంతటిపరిమితప్రదేశములుగనే తోఁచుచుండెను. మానవప్రకృతులయెడ సహవాసపరిభావ మనంతమైనది—క్రమముగ నాబాలిక

రాజాంతఃపురమునందలిదృశ్యము లన్నిటితోడను బరిచయ మయ్యెను. అప్పు డామె చంచలహృదయము సుస్థిరమైన దయ్యెను. ఈవిధముగా బాలిక నవయౌవనవతి యయ్యెను. క్రమముగా యువతి యయ్యెను. ఆమెరూపలావణ్యములు శుక్లపక్షచంద్రకళలవలె దినదినప్రవర్ధమానములు కాఁజొచ్చెను. వానితోఁగూడ నామెసపత్నీగణముల యీర్ష్యాద్వేషములును వర్ధిల్లసాగెను. అప్పుడు వారందఱును మిగులఁ గౌశలముతో సుభద్రాంగి మహారాజుకంటఁ బడకుండునట్టి ప్రయత్నములను జేయ నారంభించిరి.

పరమేశ్వరునియజ్ఞాతనియమవశంబున మనుష్యహృదయములయందు విస్మృతి యుదయించుచుండును. ఈనియమముచేతనే యొకప్పుడు సార్వభౌముఁడగు దుష్యంతుఁడు శకుంతలను మఱచిపోయెను. మహారాజగు బిందుసారుఁడుకూడ నీనియమమున కతీతుఁడై యుండలేదు. అంతఃపురవధూజనముల చాతుర్యమువలనను విస్మృతివశమునను బిందుసారుఁడు సుభద్రాంగిమాటయే మఱచిపోయెను. కాని సుభద్రాంగిమాత్రము నిశ్చింతురాలై యుండలేదు.

ప్రపంచమునందలిజనుల కందఱకును శత్రులును మిత్రులుఁగూడ నుందురు. సుభద్రసవతులామెరూపలావణ్యములంగాంచి యీర్ష్యాపరవశలై శత్రుత్వమును జూపుచున్నమాటసత్యమే — కాని యంతఃపురపరిచారికలలోఁ జాలమందియాసుభద్రాంగితో మైత్రినెఱపుచు నామెయెడల సహా

న భూతిఁజూపుచు మంచిచెడ్డలనుగూర్చి నివేదించుచుండిరి.

లోకమునం దనేకవిధములగుజనులున్నారు. కొందఱు జరగిపోయినదానింగూర్చి విచారించుచుందురు. కొందఱు వర్తమానమును జూచుకొనుచు నానందించుచుందురు. మఱికొందఱతీతవర్తమానముల యందు విరక్తులై కేవలము భవిష్యత్కాలముకొఱకే తలయెత్తుకొని చూచుచుందురు. రాజాంతఃపురమున యమున యనుపేరుగల పరిచారిక యున్నది. ఆమె వయసు నలువదియేండ్లకు మించి యుండును. ఆమె రాజాంతఃపురమునందలి యెల్లసంగతుల నెఱుంగును. అనేకుల నామె బాగుగ నెఱుంగును. వారిస్వభావములఁగూడ నెఱుంగును. మఱియు నామె రాజస్వభావమునుగూడ నామూలముగ నెఱుంగును. సుభద్రాంగిరూపలావణ్యములనుగూర్చియు నామెగుణగణములనుగూర్చియు, నామె తనలో, ఇట్టి రూపమును, నిట్టిగుణములును గూడ నెప్పుడును వ్యర్థములుకాఁజాలవు. ఎప్పుడో యీమెకొకశుభదినము రాఁగలదు. కావున నే యిప్పటినుండియు నీమెతో మైత్రి సంపాదించుకొందును. కష్టకాలమునందుఁ గావించిన యుపకార మెప్పటికి నెవ్వరును మఱచిపోఁజాలరు' అని యీవిధముగ నాలోచించుకొని యమున సుభద్రాంగిఁ బ్రీత్యర్థముగను, నప్రీత్యర్థముగనుగూడ సేవించుచుండెను — ప్రేమించుచుండెను. ఆమెకష్టసుఖములు తనవిగ భావించుకొనుచుండెను. ఈవిధముగ నామె సుభద్రాంగికి సర్వవిధముల మంగళాకాంక్షిణియైయుండెను.

యమునాసుభద్రిలు శుభసమయమున కెదురుచూచుచుండిరి. దినము గడచిపోవుచుండెను; రాత్రియును గడచిపోవుచుండెను; మాసములును వత్సరములునుగూడఁ గడచిపోవుచుండెను. కాని శుభసమయమొక్కటైనను వారికగపడుటలేదు. తుదకొకనాఁడు మంచిసమయము దొరకెను.

అది ఫాల్గునమాసము—పూర్ణిమారాత్రి రెండవజాము గడచిపోయినది. మందమందమారుతములు వీతెంచుచుండెను. ఆవాతపోతస్పర్శనమున నోషధులు పులకించుచుండెను. సమీపవృక్షాంతరాళమునందుండి యొకకోకిల తనకలకుహూస్వరంబున నమృతసేచనము గావించుచు దిగంతముల నమృతరసప్లావితములుగఁ జేయుచుండెను. పూర్ణచంద్రుఁడు వెన్నెలలఁ గురిపించుచుండెను. ఆమధురకుహూనినదమును, నానిర్మలకౌముదీవిలాసమును నేకీభవించి తమమోహినీదివ్యశక్తిచే లోకమును ముగ్ధప్రాయముగఁ జేయుటకుఁ బ్రయత్నించుచుండెను—మహారాజాధిరాజులు మహావైభవసంపన్నులే యైయుందురు; కాని వారికొక్కవిషయమునమాత్రము గర్భదరిద్రులకంటెను మించిన దారిద్ర్యము కలదు. ప్రకృతిసౌందర్యమును గాంచుభాగ్యము వారికిఁ దఱచుగ లభియింపదు. వారు చారముఖంబున నెల్లవార్తలను వినుచుందురు; చాటుకారులవలన గుణపరిచయము గావించుకొనుచుందురు; చిత్రరూపములమూలమున సౌందర్యమును భావించుకొనుచుందురు. ఒక్కరును సుఖముగ నుండుటకు వారి కెప్పు

టికో గాని సమయము దొరకదు. నిరంతరమును భార్యాచరులచేఁ బరివేష్టింపఁబడి వారికర్ణములతోడనే వినుచు వారి దృష్టులతోడనే చూచుచు నుండురు— ఇప్పు డొక్కించుక సేపు మహారాజు బిందుసారుఁ డట్టిపరాధీనతాహస్తముల నుండి విడివడి యొకపుష్పారామమధ్యమునం బరిచారము చేయుచు నేమేమియో భావించుకొనుచుండెను.

ఆసమయమునం దాకస్మికముగ నొకయువతీమూర్తి యచ్చటకు వచ్చెను. ఆమె యతిలోకసుందరీమణి— మహారాజుదృష్టి యింకనునామెపైఁ బ్రసరించియుఁ బరిసరింపక మునుపే యారమణీమూర్తి మహారాజుపాదపద్మసాన్నిధ్యమున సాష్టాంగపడి యుండెను. ఆసందర్భమున సార్వభౌముఁ డించుక యులికిపడియెనుగాని యొక్కింతసేపటిలో స్థిరప్రాదయుఁడై యామెను జూచి „ లెమ్మా! నీకోర్కె యేమియో తెలుపుము!” అని యాదరముతోఁ బలికెను. అప్పుడు సుభద్రాంగి తనచరిత్రమంతయు నాపరిభుదమ్మనకు విన్నవించెను. బిందుసారున కప్పు డెల్లసంగతులు నింతలో స్మృతికి వచ్చెను. ఆమెయెడలఁ దన భార్యలందఱును జేసినమోసము నప్పు డాతఁడు గ్రహింపఁగలిగెను. తానింతవఱకును సందేహించినసంగతి వట్టిభ్రమ యని నిశ్చయించుకొనియెను— బిందుసారుఁ డాబ్రాహ్మణకుమారీరామణీయకవిలాసములం బరిత్యక్తముగఁ గన్నులారఁ గనుంగొనియెను.

---

# ఏడవ ప్రకరణము.

---

## పుత్రలాభము.

మహారాజగు బిందుసారున కేఁబదిమంది రాణులుండిరు. ఇంతకాలమువఱకు వారిలో ధర్మాదేవి యొక్కతెయే సార్వభౌమునకుఁ బ్రధానమహిషియై యుండెను. మఱియు నామె యువరాజగు సుషీమకుమారుని కన్నతల్లి! — అందుచే నామె రాణులకందఱకు నధికారిణియై యుండెను. మహారాజు కూడ నామెమాటకు జవదాటలేఁడు. ఈవిధముగఁ జాలదినములు గడచినవి. బిందుసారుఁడు సుభద్రాంగిం జూచినతరువాతనుండి యీవిషయమునం దించుకవ్యతిక్రమము గానవచ్చుచుండెను. రాజానుగ్రహము తీవ్రవేగము గలనదీప్రవాహమువంటిది. అది యొకప్పు డొకతీరము నొరసి భంగించుచున్నప్పుడు మఱియొకతీరమును బలపఱచుచుండును. ఇప్పుడు మహారాజ్ఞీమణి యగు ధర్మాదేవితల తిరిగిపోవుచుండెను. క్రమక్రమముగా నిప్పు డామె ప్రభావప్రతిపత్తి తగ్గిపోవుచున్నది.

రాణి యగుసుభద్రాంగి కిప్పుడు మంచికాలము వచ్చినది. ఆమె యిప్పుడు రాజాధిరాజగు బిందుసారునకు రాణులలోనెల్లఁ బ్రియతమురాలై యుండెను. సుభద్రాంగికిఁ గష్టసమయము గడచిపోయినది; సుఖసమయమ్ము వచ్చినది. అదియును గడచిపోవుచున్నది. దినము, యామిని, మాసము,

వత్సరము, శిశిరము, వసంతము మొదలగునవి యన్నియుఁ జక్రావర్తన్యాయమునఁ దీవ్రవేగముతో వచ్చుచుఁబోవుచుండును.

వానితోఁగూడఁ గోరుకొనఁదగినసుఖసమయమునందలి నూతనత్వముకూడ జరగిపోవుచున్నది. ఇప్పు డామె హృదయమింకను నట్టినూతనత్వముకొఱకు వ్యాకులపడుచుండెను. ఆనూతనత్వమునందలి మనోహరత్వముం గూర్చి తెలుపుచు యమున నామెకోరికలను మఱింత వర్ధిల్లఁజేయుచుండెను. సుభద్రాంగి సపత్నులందఱును బుత్రవతులైయుండిరి. ఆమె కుమాత్ర మింకను బుత్రముఖసందర్శనలాభము కలుగలేదు. ఆకారణముచేఁ దనపై మహారాజున కించుక యనాదరము కలుగునేమో యనువిచార మామెహృదయమును వేధింపసాగెను.

రాణి యగుసుభద్రాంగి సంపూర్ణయౌవనవతియై యుండెను. ఆమెహృదయమున నిరాశచ్ఛాయ లించుకించుక ప్రజ్వలించుచుండుటచే నామెరూపయౌవనవిలాసకాంతులించుకించుక మాసమును గాంచెను. కాని యాయాజ్ఞామణి కట్టియవస్థ యెన్నియోదినములవఱకు నిలిచియుండలేదు. ఆమె కిప్పుడించుక యస్వస్థతగా నున్నట్లుతోఁచుచుండెను. హంసతూలికాతల్పమున శయనించుటకూడ నామెకుఁ గష్టముగా నుండెను. సుఖాద్యములుకూడ ననపేక్షితములై పోయెను. అమృతమునందును నరుచి యుదయించెను— మట్టిదిన

వలయునని మనిసయ్యెను. అప్పుడు సుభద్రాంగి యమునతోఁ దనశరీరపీడంగూర్చి యంతయును జెప్పెను. ఆమాటల నాలించి యమున పరమానందముతో 'అమ్మా! ఇవి యన్నియును పీడాలక్షణములు కావు— సర్వమును శుభలక్షణములే' అని బోధించెను.

క్రమముగా నీసంగతి యంతఃపురమునం దంతటను వ్యాపించెను. నూత్నరాజ్ఞీమణికూడ సంతానవతి యగు నని యందఱు ననుకొనుచుండిరి. గర్భస్థశిశువు దినదినము నెట్లు వర్ధిల్లుచుండెనో యట్లే సుభద్రాంగిసపత్నులయీర్ష్యానలము కూడ వర్ధిల్లఁజొచ్చెను. అప్పుడు రాణులలోఁ గొందఱు 'మంచిది. సుభద్రాంగి గర్భవతి యైనది. అదృష్టవంతురాలు! మంచిసంతానమే కలుగును. కాని, రాకరాక గర్భము వచ్చినది. ఇంతవయసునకుఁ దొలిచూలు! ఱరపాయముగఁ బ్రసవింపవలయును గద! ఏమో! ఏనాఁటికెట్లు వచ్చునో యెవ్వరికిఁ దెలియును' అని యనుకొనుచుండిరి. కోటయందంతటను నామెగర్భముంగూర్చిన మాటలే. ఆగర్భమే యామెజీవితమార్గమును నిష్కంటకముగఁ జేసివైచెను: అదియే యామెరాజ్ఞీస్థానమును దేవతాస్థానముగఁ బరిణమింపఁజేసెను!

దేవతలెల్లప్పు డుసందఱప్రార్థనములను—అన్నిప్రార్థనములను సంపూర్ణముగ సిద్ధింపఁజేయరు. సుభద్రాంగిసపత్నులమనోగతప్రార్థనములును సంపూర్ణముగ ఫలియింపలేదు. రాణి యగుసుభద్రాంగి యొకశుభముహూర్తమునం దొకకుమారు

నిగనియెను. క్రొత్తగాణి పుత్రవతి యయ్యెను. ప్రసవసమ యమునందామె కెట్టికష్టమును గలుగలేదు ఆకారణముచేఁ గుమారునకశోకుఁడని నామకరణము గావింపఁబడియెను.

---

## ఏడవప్రకరణము.

---

### అశోకుని శైశవము.

రాజ్ఞీరత్న మగుసుభద్రాంగి పుత్రముఖసందర్శనమునఁ బరమానందభరితహృదయ యయ్యెను. మహారాజు కూడఁ దనవలెనే యీనవకుమారసందర్శనమునఁ బరమానందరసనిమగ్నుఁడగునని యామె యనుకొనెను. కాని యామెకోరిక యీవిధముగ ఫలియింపలేదు. మహారాజు యథాసమయమునందే పుత్రముఖావలోకనముం గావించెను. కాని యప్పు డాతనికన్నులలోఁ బ్రేమరసతరంగములు పొడసూపలేదు; ఆతనిముఖమండలమున నానందకౌముదీవిలసన మగపడలేదు. కేవల మప్పు డాతఁడు ధనరత్నాదికములదానము చేసి కుమారుని నాశీర్వదించిమాత్రము వెడలిపోయెను. సుభద్రాంగి యిదియంతయును బరిశీలించి చూచుచునేయుండెను. మఱికొందఱు పరిచారకులుకూడ నాభావమును గ్రహించి యుండిరి.

ఒక్కనినుసభలో నీసంగతియంతయును సుభద్రాంగినవతులచెప్పఁబడియెను. మహారా జుదాసీనుఁడై యుండె

నని వినుటవలన వారియీర్ష్యానల మించుక శాంతించెను. ఆరాణులలో నొక్కరొక్కరొక్కొక్క విధముగఁ జెప్పుకొనసా గిరి. తుదకు వారందఱు గర్వితురాలైన సుభద్రాంగికిఁదగిన శాస్తియైనదని నిశ్చయించుకొనిరి. 'ఎంతగర్వము! ఇంతటిగ ర్వముధర్మాదేవి యెట్లుసహించినదో?— దర్పహారి యగు మహారాజు సుభద్రాంగిదర్పభంగమును బాగుగఁ గావించి నాఁడు— ఇప్పటి కిది ప్రథమసూచనామాత్రము' అని య నుకొనిరి. కాని ప్రకృతస్థితి యది కాదు. సుభద్రాంగియప రాధ మేమనిన:— ఆమెకుమారుఁ డితరరాజకుమారులవ లె సుందరుఁడు కాఁడు. ఇతనియ కాళ్ళు చేతులు మిగులఁ గురూపియై యుండెను. అతని కంఠగానంగసౌష్ఠవము లేదు. అతని శరీరచ్ఛాయ గౌరవర్ణమిశ్రితమై యుండలేదు.

ఈసకలకారణములచేతను రాజప్రథమదృష్టి యశో కకుమారునిపైఁ బ్రేమపూర్ణముగఁ బ్రసరించినది కాదు. బిందుసారునియేకాధిక శతపుత్రులలోఁగూడ నాతనిప్రథమమ హిషీతనయుఁ డగుయువరాజు సుషీముఁ డొక్కఁడు మాత్ర మే ప్రియతముఁడై యుండెను.

ఎవ్వరేమనుకొన్న నేమి? సుభద్రాంగిమాత్రము క న్నబిడ్డ యగునశోకుని జూచి యెల్లకష్టములను మఱచి పో యెను. ఆమె ప్రేమోపచారములచే నశోకుఁడు శుక్లపక్షచం ద్రునివలె దినదినప్రవర్ధమానుఁ డగుచుండెను బాలుఁ డగు నశోకుఁడు తనకురూపముంగూర్చి చెప్పఁ నువారిమాటలయ

ర్థ మెంతమాత్రమును గ్రహించియుండలేదు. కేవలమ్మాతం డెన్నఁడు నొక్కనిమిషమంతైన దుఃఖించియుండలేదు. అశోకుఁడు రాజగృహమునం గలయెల్లరాజకుమారులతోడను సమానానందముననే— సమానోత్సాహముననే యాటలాడుకొనుచుండెను. క్రమముగ నశోకునకుఁ బసితనము వదలుచుండెను. బాలకుఁ డగునశోకున కప్పుడు విద్యాశిక్ష ప్రారంభ మయ్యెను. క్రమముగ నాతనికి లోకజ్ఞానము కలుగుచుండెను. అప్పటినుండియే బాలకుఁ డగునశోకుఁడు తనతండ్రిచర్యలయందలి పక్షపాతమును గ్రహియించి యుండెను. ఆరాజగృహమున నాచంద్రశాలామంటపమధ్యమున నవవికసితశతశతపత్రింబులంబోలి విలసిల్లుచున్న తనకుమారులనడుమ భ్రమరనీలవర్ణుండును, శోభాసారభవిహీనుండును గురూపియు నగునశోకుని జూచినప్పుడు బిందుసారుఁ డించుక యప్రతిభుఁడై పోవుచుండెను— తుదకు విరక్తుఁడై పోయెను. బాలకుఁ డగునశోకున కాసంగతి యంతయుం దెలిసిపోయినది. కాని యందులకుఁ గారణముమాత్రము మాతనికి బాగుగబోధపడలేదు. అశోకుఁడు తల్లియొద్దకు వచ్చి యావిషయముంగూర్చి యడుగునప్పుడు సుభద్రాంగి వానియెడ ధోరణిలో నాతని కామాట మఱపించివైచుచుండెను.

ఈసకలకారణములచేతను సుభద్రాంగి భర్తృప్రియతమురాలయ్యెను, నిరంతరచింతాసంతప్తహృదయయైయుండెను. కుమారునియెడల దండ్రికిం గలయింతటియుదాసీనత.

ఇంతటియసహ్యభావము తుదకేవిధముగఁ బరిణమించుకోయని యామె నిరంతరము విచారించుచుండెను.

అశోకునియెడల బిందుసారున కిట్టియసహ్యభావ మున్నదని తెలియనివా రెవ్వరును లేరు. ఏమైననేమి? జనకుని యింతటియసహ్యభావము కుమారుఁ డగునశోకునికిలోచిత విద్యాశిక్షణమునకుమాత్ర మెంతమాత్రము వ్యాఘాతముం గల్పించియుండలేదు. అదియేమోకాని యశోకుఁడు తనవైమాత్రేయసోదరుల కంటె నల్పకాలములోనే యధికవిద్యావంతుఁ డగుచుండెను; సకలవిషయములయందును విజ్ఞానలాభము నందుచుండెను. కుమారునికుశాగ్రబుద్ధిఁగూర్చిన ప్రశంసాపచనముల ప్రతిధ్వనులు క్రమముగా నలుదెసల చెప్పఁబడుచుండెను. అందుచే సుభద్రాంగి పరమానందభరితహృదయ యగుచుండెను.

తండ్రివైముఖ్యము, సవతితల్లులయసూయ, సోదరుల తూష్ణీభావము, గురువులబోధనము, ఉత్సాహనకల్పనము జననీప్రేమము, యత్నము, సాంత్వనము మొదలగువానినడుమ నశోకుని శైశవజీవితము గడచుచుండెను.

---

తొమ్మిదవప్రకరణము.

---

అశోకుని భవిష్యత్తు.

ఒకదినమున మహారాజగుబిందుసారుఁడు తనకుమారులవిద్యాశిక్షణముంగూర్చి పరీక్షింపవలయు నని తలంచెను.

విద్యావిషయంబున నెవ్వ రెంతటివిజ్ఞానమును సంపాదించిరో తెలిసికొనుట యావశ్యక మని మహారాజు భావించెను. రూపగుణశీలంబుల నధికుం డగురాజకుమారుండే భవిష్యత్ప్రభుపదంబున కర్హుండై యుండు నని యాతని యభిప్రాయము.

శక్తిమంతులును సత్త్వవంతులు నగువారికోరికలు కార్యరూపమునం బరిణమించుటకు విశేషకాలము పట్టదు. మహారాజు తనయుద్దేశమును బ్రకటించినతోడనే రాజకుమారులను బరీక్షించుటకుం దగినస్థలమును, దగినసమయమునుగూడ నిర్దిష్టములయ్యెను. అన్నియును సంసిద్ధము లయ్యెను.

నగరోపకంఠమున నొకవిశాలోద్యానమునందు రాజకుమారులను బరీక్షించుట కేర్పాటయ్యెను. రాజకుమారులందఱు నా దినమున నచ్చటనేయుండవలయు నని స్థిరపఱచిరి. ఉద్యానమధ్యంబున విశాలంబును విస్తృతంబును నగుసమప్రదేశమునం గౌముదీప్రభలు కన్నులపండువు సేయుచుండెను. ఆ వెన్నెల బయట విచిత్రాసనము లలంకరింపంబడియుండెను. ఆ చుట్టును నవదూర్వాంకురశ్యామంబును, వర్తులాకారంబును నగుభూతలము నయనాభిరామంబై యుండెను.

సూర్యోదయమైనది మొదలుగ నా సభాస్థలమునకు జనులు వచ్చుటకారంభించిరి. రాజకుమారులుకూడ నొక్కొక్కరుగ నా యాసనములయందువచ్చి యాసీనులగుచుండిరి. రాజపుత్రులందఱును మనోజ్ఞ వేషభూషణాలంకృతులై యుండిరి. రథారూఢులై కొందఱును, తురగారూఢు

లై కొందఱును వచ్చి ప్రవేశించుచుండిరి. క్రమముగ నందఱును వచ్చిరి. మహారాజును మంత్రులునుగూడ సభాస్థలమునను విచ్చేసి యుండిరి. కేవల మొక్కఁడుమాత్ర మచ్చటికి వచ్చియుండలేదు. రాజకుమారుఁడగు నశోకుని యథానమయమునం దీసంగతి తెలిసినదికాదు. అందులకుఁ గారణము వేఱుగఁ జెప్పవలయునా? ఆచండ్రశాలార గమున— ఆసుందరకుమారమధ్యమునఁ గురూపి యగునశోకుఁడు ప్రవేశించుటకు మహారాజున కిష్టములేదు. కాని యాతఁ డంతస్పష్టముగా నెట్లు చెప్పఁగలఁడు? రాణి యగుసుభద్రాంగి కెట్లో యీవార్త తెలియవచ్చెను. తోడనే యామె తనకుమారుని గూడఁ బరీక్షాపరిషత్తునకుఁ బంపించెను. సుభద్రాంగి తన కుమారుని బరీక్షాసభకుఁ బంపఁబోవునప్పటికి రాజాస్థానమునందలి సుందరామూల్యవాహనాదికములన్నింటి నుపయోగించుకొని తక్కినప్రభుకుమారు లందఱును సభకుఁ బోయియుండిరి. ఒక ముసలి యేనుఁగుమాత్రము మిగిలి యుండెను. అశోకుఁడు తల్లియొద్ద సెలవు దీసికొని యాయేనుఁగుపైనెక్కి బయలుదేరెను. అప్పటి కాసభారంగ మంతయును జనసముద్రముగ నుండుటఁ గాంచి యశోకుఁ డాచంద్రాశ్రితపబహిర్భాగముఁ గోమలశాద్వలతలంబునఁ గూర్చుండి యుండెను.

సన్యాసి యగుపింగళవత్సజీవుఁడు పరీక్షకుఁడుగ నియమింపఁబడియెను. క్రమక్రమముగ రాజకుమారు లందఱును బరీక్షింపఁబడిరి. విద్యాబుద్ధులయందు రాజకుమారు లందఱు

లోనను నశోకుండే యున్నతస్థానము నలంకరించినట్లు నిరూపితమయ్యెను. ఆతండే సుశీలుండును సూక్ష్మబుద్ధియు నని యందఱకును బోధపడియెను. కాని యాతండు కురూపి; శోభావిహీనుండు; జనకుని కప్రియుండు! అప్పుడయ్యశోకుని యుత్తమత్వము గూర్చి యంతబహిరంగమున నంతవిస్పష్టముగం బ్రశంసించుట కెవ్వరును సాహసింపంజాలకపోయిరి. పరీక్షకుండగుపింగళవత్సజీవుం డెల్లవిధముల బాగుగ నాలోచించెను. 'ఈయశోకుండు మహారాజునకుం గేవల మప్రియుండు. సర్వవిధములను రాజసింహాసనమున కశోకుండే యర్హుండని చెప్పినచో నది యాతనికి మిగులం బ్రతికూలముగం బరిణమింపంగలదు. కావున మిగులనిపుణముగ మహారాజునకు సత్యమును బ్రదర్శింపవలయును.' అని నిశ్చయించుకొని 'మహాప్రభూ! నేనీరాజకుమారుల నందఱను బరీక్షించితిని. వీరిలో నెవ్వరివాహనము సర్వవిధముల నున్నతమైనదో, యెవ్వరిపీఠ మెల్లరీతుల నుత్కృష్టమైనదో, యెవ్వరిపానీయ మెల్లభంగుల నుత్తమమైనదో వారే సర్వవిధములను భవిష్యత్ప్రభుత్వమున కర్హులు' అని చెప్పెను.

ఆమాటల నాలించి రాజకుమారు లందఱును బ్రత్యేకముగం దమలోందా మాలోచించుకొని తమతమయాసన పానీయములే యితరులవానికంటె శ్రేష్ఠములని నిశ్చయించుకొనుచుం దమయిచ్చవచ్చిన తెఱంగున సిద్ధాంతము చేసికొనంజొచ్చిరి. కురూపి యగునశోకుండు సభముగిసినతరువాతం

దల్లియొద్దకువచ్చి పింగళవత్సజీవుఁ డొనరించిననిర్ధారణముం గూర్చి యెల్లసంగతులను దెలియఁజేసెను. అనంతర మశోకుఁడు తల్లియెదుటఁ బింగళవత్సజీవునివాక్యముల కీవిధముగ వ్యాఖ్యానముం గావించెను— నేను పితృపితామహోచితంబగువృద్ధభద్రగజము నధిరోహించి పోయితిని; అదియే సర్వోన్నతవాహనము. నేను శ్యామలదూర్వాదళశోభితంబగు ధరణీతలంబున నుపవసించితిని; అదియే సర్వోత్కృష్టమృదులాసనము. నేను విశర్కరాస్నిగ్ధపావనగంగాజలంబులఁ బానము చేసితిని: అదియే సర్వోత్తమపానీయము. కావున మహాత్ముఁడగునా పింగళవత్సజీవుని వాక్యములు సత్యములే యైనచో నేనే భవిష్యత్కాలమునందుఁ బితృసింహాసనమును బొందఁగలుగుదును.

మాతాపుత్రుల ప్రియసంభాషణ మీవిధముగ జరిగినది. అది మొదలుగ వారిహృదయము లాశాన్వితము లగుటచే భవిష్యత్సుఖసమయమునకై వారిరువురు నెదురుచూచుచుండిరి.

---

## పదియవప్రకరణము.

---

### జనకునియాజ్ఞ.

మహారాజగుచంద్రగుప్తుఁడు తనబుద్ధిబలమునను బాహుబలమునను గూడ మగధరాజ్యమును జాలదూరమువఱకు

ను వ్యాపింపఁజేసెను. ఆకాలమునఁ దక్షశిల మగధరాజ్యాం తర్గతమై యుండెను. చంద్రగుప్తుఁడు తానెంతవఱకుఁ దంరాజ్యమును విస్తరింపఁజేసెనో యంతవఱకుఁ దనశాసనము నుగూడఁ బ్రసరింపఁజేసెను— కాని యెల్లకాలము నొక్క రీతిగా నుండదు; ఎల్లదినములు నొక్కలాగున జరుగవు. ఇప్పుడు మహారాజగుబిందుసారునిరాజ్యసమయమునఁ దక్షశిలయందు విద్రోహములు బయలువెడలెను. సామంతరాజులు తమలోఁదాము కలహించుచుండిరి. రాజ్యలోలసత్వమే యిందులకుఁ బ్రధానకారణము— మఱియుఁ బ్రజావిద్రోహము మఱియొకవిధముగ నుండెను. రాజోద్యోగులదోషములవలనను, వారికఠినశాసనములవలనను, దుష్టకృత్యములవలనను దూరదృష్టిలేని ప్రజలు విద్రోహులగుచుండిరి. రాజగుబిందుసారుఁడీద్రోహవార్తలనాలకించెను. మొట్టమొదట నాతఁడు యువరాజగుసుసీముని ససైన్యముగ నాస్థలమునకుఁ బంపించెను. ప్రథమమునఁ బ్రజలందఱును యువరాజగుసుసీమునింగాంచి యించుక శాంతివహించి యుండిరి. యువరాజు తమతమకష్టములం గూర్చి యాలకించి యందుకుఁ దగి ప్రతిక్రియ నాచరించునని వారికి మిగుల నమ్మకము కలిగెను. కాని యచిరకాలములోనే వారికాభావ మంతయు వదలిపోయెను. అప్పుడు ప్రజలందఱును యువరాజుతీవ్రస్వభావములనను గఠినశాసనములమూలమునను తమ్ము దండించుటకై వచ్చియుండెనని భావించుకొనిరి. అం

దువలన మరల నారెప్పటివలె నల్లరులం జేయుట కారంభిం
చిరి. యువరాజు శాంతిస్థాపనమునకై చేసిన యాత్ర యీవిధ
ముగ నిష్ఫలమైపోయెను. అందుచే నాతఁడు నిరర్థకముగ స్వ
దేశమునకు మరలవలసినవాఁ డయ్యెను.

మహారాజగు బిందుసారుఁడు పుత్రసుఖంబున నెల్ల
సంగతుల నాలకించెను. అప్పు డాతఁడు తనకుఁ దానే
తెలిసికొనఁగలిగెను. తోడనె యామహారాజు కుమారుఁడగు
నశోకుని బిలిపించెను. పిమ్మట బిందుసారుఁ డశోకున కెల్ల
వృత్తాంతమును జెప్పి యేమేమిచేయవలయునో కూడఁ దెలి
యఁజేసెను. రాజ్యమున కతిదూరమునఁ బశ్చిమప్రాంతము
నందు శాంతిస్థాపనము కొఱకు—— విద్రోహదమనముకొఱ
కుఁగాను—— కుమారున కేమి కావలయునో తండ్రి యన్ని
యు నొసంగెను—— కేవల మస్త్రములను సైన్యముమాత్ర
మాతని కీయలేదు. అశోకుఁడు తండ్రియభిప్రాయమును గ్ర
హియించెను. అతఁడు నిర్భయుఁడై తక్షశిలకుఁ బ్రయాణ
మయ్యెను. కొలఁదికాలమునందే యశోకుఁడు నిరపాయముగఁ
దక్షశిలం బ్రవేశించెను; అచ్చటిప్రజల కండఱకును బ్రేమ
పూర్వకముగ దర్శన మొసంగెను; వారికష్టసుఖంబులఁ బరి
శీలించెను: వారియభియోగకారణముల విస్పష్టముగ గ్రహిం
చెను. వారికష్టములయెడల సహానుభూతిని బ్రకటించెను.
కష్టనిర్వాపణమునకుఁ దగుప్రతిక్రియలం గావించెద నని
చెప్పి వారిమనంబుల కూఱట గలిగించెను. రాజపుత్రుఁడు శ

ప్రజలనుగాని, సైన్యమునుగాని తీసికొని రాలేదనియు, దుష్టు దండింపవలయు ననునుద్దేశముతో వచ్చినవాఁడు కాఁడనియుఁ, దమలో శాంతిస్థాపనము చేయుటకే దర్శన మిచ్చియుండె ననియుఁ బ్రజలందఱును మొట్టమొదటనే భావించియుండిరి. తరువాత నాతఁడు యూర్ద్రహృదయమును, దదనుకూలవ్యవహారములను గాంచి తమకు క్షేమలాభము లం గల్పించెదనని చెప్పిన సమాదరశీతలంబు లగుసాంత్వనవచనంబుల నాలకించి ప్రజాగణ మంతయు శాంతభావమును వహించియుండెను. అశోకునియాత్ర సఫల మైనది. పితాజ్ఞాపరిపాలన మైనది.

---

## పదునొకండవప్రకరణము.

### గుణాదరము.

అశోకుఁడు తక్షశిలయందు శాంతిస్థాపనముచేసి రాజధానికి మరలివచ్చెను. పదినూ తేఁడులబాలకుఁ డగు నారాజకుమారుఁ డొక్కఁడును బోయి పెద్దలగువారికిఁగూడ నతిదుష్కరం బగుమహాకార్యమును సర్వశ్రేయస్సంపన్నముగ నెఱవేర్చుకొని వచ్చెను. మహారాజ బిందుసారుఁ డింతకాలమువఱకును గుణాపేక్షుఁడయ్యు, వికారాకారుఁ డని యుఁ దలంచి యశోకుని జూచుటకుఁగూడ నసహ్యపడుచుండెను. తక్షశిలయందు శాంతిని నెలకొల్పుటకై పోయిన యశో

కునకచ్చట నేవిషమసంకటముననైనఁబడి మరణించుటయే తటస్థించినయెడల నది మహారాజునకు దుఃఖదాయకమే యగునో మఱియేమగునో మేమెంతమాత్రము నూహలవలన నిర్దేశింపఁజాలము. అప్పు డేమగునో చెప్పఁజాలముకాని పితాప్రజాపరిపాలనతత్పరత, సాహసము, నీతికుశలత మొదలగురాజకులోచితసద్గుణగణంబు లన్నియు నశోకునియందు మూర్తీభవించియున్నట్లు పొడకట్టుటచే నిప్పుడు మహారాజాతనియెడలఁ బరమాదరభావమునే సూచింపఁదొడంగెను.

ఆసమయమునకు సరిగ నుజ్జయనీమండలమును బ్రజానుకూలముగఁ బరిపాలించుటకుఁ దగినసమర్థుఁ డగురాజప్రతినిధినొకని నియమించుట యావశ్యక మయ్యెను. ఎంతటిసమర్థులైనను దనయుద్యోగిజనులయం దిట్టి మహోన్నతకార్యభారమును బెట్టుటకు మహారాజున కిష్టములేకపోయెను. ప్రకృతమునం దశోకుఁడు సకలసద్గుణగరిష్ఠుండనియు, నసామాన్యప్రతిభాశాలియనియు ననుభవమునం దోఁచుటచే సార్వభౌముఁ డగుబిందుసారుఁడు బాగుగ నాలోచించి యవంతీమండలరాజప్రతినిధిపదంబున కశోకకుమారుఁడే యర్హుఁడని నిశ్చయించి యావిధముగ నియోగించి యాతని నచ్చటికిఁ బంపించెను.

ఇందూరునకు సమీపమున నవంతీనగరనామ మెల్లవారికిఁ బరిచితమైనదియే. స్థలమాహాత్మ్యముచే నిప్పటికి నాపవిత్రనామము సుప్రసిద్ధముగనే యున్నది:—

"అయోధ్యా, మధురా, మాయా, కాశీ, కాంచీ, అవంతికా।
పురీద్వారావతీచైవ, సప్తైతామోక్షదాయికాః॥"

అనువిషయము సకలభారతజనసమీచీనమైయున్నది. అవంతీస్థానమున కాధునికనామము మాళవ్యము. అవంతీమండలమునకు రాజధాని యుజ్జయినీనగరము. మహాకవి యగుకాళిదాసుఁ డాయుజ్జయినీనగరమున కమరత్వమును బ్రసాదించియున్నాఁడు. విక్రమాదిత్యునియుజ్జయినీనగరమునందలి సుధాధవళంబు లగుసుందరసౌధమాలికలును, సలోకసామాన్యరూపలావణ్య విలాసవతు లగుపురవధూమణుల విలాస విభ్రమలీలారంగంబు లగు రమ్యప్రమోదారామంబులును నిప్పు డేమైపోయినవి? అవియన్నియును గాలవాహినీగర్భమునం గలసిపోయినవి. కాని మహాకవిశిరోమణి యగుకాళిదాసుఁడు దనకావ్యమునందుమాత్రము వానికన్నిటికిని శాశ్వతజీవనమునుగల్పించి యున్నాఁడు. ఆమహాకవిసార్వభౌముఁడు తన మేఘసందేశ మహాకావ్యమునందు శాపగ్రస్తుఁ డగుయక్షునిచే నవ్వనీరదమునుంజూచి 'నీకించుక చుట్టుత్రోవయైనను నొకసారి యుజ్జయినీనగరమునకుం బోయి యాపురవిలాసమును గన్నులకఱవుదీరఁగాంచి నీకన్నులకును జీవితమునకును సార్థక్యముం గూర్చుకొని మఱిపొమ్ము' అని చెప్పించియున్నాఁడు. సాహిత్యసంస్కరణమున కిప్పుడప్రస్తుతమే యైనను యథాసమయమున మాననీనపాఠకులకు మహాకవిశేఖరుం డగుకాళిదాసుని మేఘసందేశమహాకావ్య

ము నొకసారి పఠింపవలయు నని బోధించుట యసంగతకార్య ముకాదని తలంచుచున్నారము.

అశోకుఁడు జనకునియానతిచే నాతనికిఁ బ్రతినిధియై యుజ్జయినీపట్టణమునం దుండెను. ఆతఁ డారమణీయనగరము నందుండి మిగులసమర్థతతో నవంతీమండలప్రజావర్గము ననుకూలశాసనములతోఁ బరిపాలించుచుండెను. ఆతని ధర్మశాసనసమయమునఁ బ్రజలలో నెట్టివిద్రోహులుగాని, దేశమునం దెట్టిదుర్భిక్షములుగాని లేవు. ప్రజలు నిరంతరసంతుష్టులై యుండిరి. ఆతఁడును సుఖసంపూర్ణుఁ డయ్యెను. అశోకుని యౌవనము నందలి ప్రథమభాగ మీయుజ్జయినీనగరముననే గడచినది. ఆతఁ డామండలమునం దున్నప్పుడే విదిశానగరమునందలి యొకసుప్రసిద్ధ వర్తకునితనయను బరమరూపలావణ్యవతి యగుకన్యకను బెండ్లియాడెను. నవయౌవనము, అప్రతిహతం బగుప్రతాపము, రమణీయం బగురాజధానీనగరము, విలాసవిభ్రమలీలారంగంబు లగుప్రమోదోద్యానములు, సకలసంపత్సమృద్ధ బగు రాజ్యము, సుఖసంతుష్టులగుప్రజలు, రూపయౌవనసంపన్నయు, ననురక్తయు నగు ధర్మపత్ని— అశోకున కన్నియును లభియించినవి. ఇవి యన్నియును లభియించుటంబట్టియే యశోకుఁ డుజ్జయినియందున్నప్పుడు నిరంతరముఁ బరమానందముతోఁ గాలమును సార్థకముగఁ జేసికొనెనని చెప్పవచ్చును. గుణములయందలి యాదరముచేతనే తనతండ్రి రాజప్రతినిధిగఁ జేసి తన్నుజ్జయి

నగరమునకుఁ బంపియుండె నని యశోకుఁడు భావించు
కొనియెను.

---

## పండ్రెండవప్రకరణము.

---

### గృహసమాచారము.

అశోకుఁడుజ్జయినీనగరమునందుండి యవంతీమండలమున సుఖశాంతివిధానము లాచరించుచుఁ బరమానందమునగా క్షేపము చేయుచుండెను. ఆతని కచ్చట నున్నప్పుడే తానభ్యసించిన రాజనీతికౌశల్యమును గార్యరూపమున నుపయోగించుకొనుట కవకాశము దొరకెను.

ఆతఁడచ్చట నున్నకాలమునం దచ్చటఁబాటలీపుత్రమునందు స్థితిగతు లంతబాగుగ లేవు. ఆరాజస్థానమునఁ జిరకాలమునుండియు న్యాయసభ యొకటి యుండుటయు దానిమూలముననే మహారాజు రాజకార్యములం దీర్చుచుండుటయు జరగుచుండెను. సార్వభౌముఁడగు బిందుసారుఁడు కూడ నీనియమము నతిక్రమించియుండలేదు. ఆసభాలోచనములం బట్టియే మగధరాజ్యము వివిధభాగములుగ విడఁదీయఁబడుటవలన నున్నతోద్యోగులసంఖ్య యధికమయ్యెను. ఆయుద్యోగు లందఱునుగూడ న్యాయపరిపాలనాసభకు సభ్యులుగనే యుండిరి. చంద్రగుప్తుని ప్రభుత్వసమయమునం దట్టిసభ్యులైదువందలమంది యున్నట్లుతెలియవచ్చుచున్నది. బిం

దుసారుఁడుకూడ వారియాలోచనల ననుసరించియే రాజ్యమును బరిపాలించుచుండెను. ఆరాజసభామధ్యమున రాధాగుప్తుఁడు మంత్రియై యుండెను. ఖల్లాతకుఁడు ప్రధానమంత్రి కాకపోయినను నాతనిప్రభావ మెల్లవిషయములయందును నిరాఘాటముగఁ గొనసాగుచుండెను. రాజోద్యోగు లంతయు నాతని మిగుల గౌరవించుచుండిరి. అశోకుఁడు తక్షశిలకుఁ బోయినకాలమున యువరాజ సుసీముఁడు ప్రవీణుఁ డగు నాఖల్లాతకుని జాలఁ గౌరవముగఁ జూచెను. రాజ్యమునకు భవిష్యత్ప్రభుఁడు కాఁదగినయాయువరాజు నడవడి యందఱకు నసంతుష్టిని గల్పించెను. అందఱును క్షుణ్ణహృదయులై భయపడుచుండిరి. యువరాజగుసుసీముని ధూర్తత్వమును జూచి మంత్రియగు రాధాగుప్తుఁడును మిగుల విరక్తుఁ డయ్యెను. అప్పటినుండియుఁ గ్రమక్రమముగ నారాజసభాసభ్యు లందఱును యువరాజునెడల నసంతుష్టులై పోయిరి. పిమ్మట నశోకుఁడు తక్షశిలయందు శాంతిని నెలకొల్పి మరలివచ్చెను. అప్పు డాతఁడు తనజనకునియొద్దం గలయున్నతోద్యోగుల నందఱను సన్మానించెను. అప్పుడు రాధాగుప్తుఁడును ఖల్లాతకుఁడునుగూడ నెల్ల విధముల యువరాజుకంటె నశోకుఁడే యోగ్యతముఁ డని నిశ్చయించుకొనిరి. రాజసభలోఁ జాల మందిసభ్యులసమాదరవిశ్వాసములు క్రమక్రమముగ నశోకునివంకకే ప్రసరింపసాగెను; సుసీమునియందలి విరక్తియు

నశోకునియందలి యనురాగమును దినదినాభివృద్ధి నందుచుం డెను. సుషీముఁడు యువరాజును జనకునకుఁ బ్రియపుత్త్రుఁడు నుగూడ నైయుండెను. అయినను నశోకునిపక్షముననే యున్నతోద్యోగులయనురాగము ప్రబలతమమై యుండెను.

రాజధానియందలియున్నతోద్యోగులభావము లీవిధముగఁ బరిణమించుకాలముననందే యువరాజగుసుషీముఁడు నశోకుఁడునుగూడ నచ్చట లేకయుండిరి. అప్పుడు సుషీముఁడు తక్షశిల యందును నశోకుఁ డుజ్జయినియందు నుండిరి. ఈసమయమునందే హఠాత్తుగ మహారాజగుబిందుసారుఁడు వ్యాధిపీడితుఁ డయ్యెను. ఆవ్యాధి క్రమక్రమముగ వర్ధిల్లుచుండెను. అప్పుడు మహారాజు యువరాజగుసుషీముని బిల్పింపవలయు నని యాజ్ఞాపించెను. మహారాజు స్వస్థుఁడై యున్నను నస్వస్థుఁడై యున్నను నాతఁ డెప్పుడును గార్యాచరణవిషయంబునఁ బరముఖాపేక్ష కలవాఁడైయె యుండెను. ప్రభుఁడగు బిందుసారుని యాజ్ఞ యథావిధిగఁ బరిపాలింపఁబడిన మాట సత్యమే—కాని యాతఁ డభిప్రాయము మాత్రము సిద్ధించినదికాదు. రాధాగుప్తుఁ డింతకుముందుగనే బయలుదేరి రావలయు నని యశోకునకు వార్తనంపియుండెను. ఇప్పుడుకూడ నుద్యోగపద్ధతి ననుసరించి సుషీమునకును మరల నశోకునకునుగూడ సమాచారము నంపించెను—అప్పటికే మహారాజు వ్యాధి ముదిరిపోయినది. ఆరోగ్యము కలుగునను నాశయతిస్వల్పము—

---

## పదుమూఁడవ ప్రకరణము.

---

### రాజ్యలాభము.

మహారాజగు బిందుసారుఁ డేఁబదివత్సరములు రాజ్యముచేసి క్రీ॥ పూ॥ 272 వ సంవత్సరమునందుఁ బరలోకగతుం డయ్యెను. అప్పుడు మగధరాజ్యసింహాసనము శూన్యమై యుండెను. ఆతఁడు తనయవసానకాలమునందుఁ దనప్రియపుత్రుఁ డగు సుసీముఁడే తనసింహాసనము నధిష్ఠింపఁగలఁ డని తలంచి యుండెను. ఇట్టి యాశచేతనే యాతఁడు తాను రోగశయ్యయందున్నప్పుడు తనకుమారుని దక్షశిలనుండి పిలిపింపవలయునని యాజ్ఞాపించి యున్నాఁడు. అప్పటియాతని యాజ్ఞ సాగనే పరిపాలింపఁబడినది; కాని యాతని యాశ మాత్రము ఫలియించినది కాదు. ఎందులకు ఫలియింపలేదో యాసంగతి నిదివఱకే చెప్పి యున్నారము. రాధాగుప్తుని కూటతంత్రముచే నశోకునకుఁ దనతండ్రి వ్యాధిగ్రస్తుఁడై యుండె నను సంగతి ముందుగనే తెలియవచ్చెను. ఆవార్త వినినతోడనే యశోకుఁడు తటిద్వేగమున నుజ్జయినినుండి పాటలీపుత్రమునకు వచ్చియుండెను. కాని యాతనికప్పుడు జనకసందర్శనభాగ్యము లభియింపలేదు. శూన్యమైయున్న పితృసింహాసనమును మాత్ర మాతఁడు దర్శించెను.

రాధాగుప్తఖల్లాటకప్రముఖు లగు రాజసభాసభ్యు లందఱు నేకగ్రీవముగ నిదివఱకే నిశ్చయించుకొనియుండుటచే

వారందఱును గలసి యప్పుడే మగధరాజ్యమున నశోకుని రాజుగఁ జేసివైచిరి. బిందుసారుని యనంతరము నాతని ప్రియతమసతీరత్నమగు సుభద్రాంగికుమారుఁ డశోకుఁడే యావిశాలమగధరాజ్యమునకు మహిమాన్వితుఁ డగుమహారాజచంద్రుఁ డయ్యెను— ఈయుత్సాహవార్త రాజ్యమునందంతటను బ్రకటింపఁబడియెను.

ఇట సుసీముఁడును నిశ్చింతుఁడై యుండలేదు. జనకుని కష్టవార్త విన్నతోడనే యాతఁడును సాధ్యమైనంతవఱకు శీఘ్రప్రయాణములు చేసి స్వదేశమునకు వచ్చియుండెను. తోడనే మంత్రులందఱును గలసి మగధరాజ్యమున నశోకునే రాజుగ నెన్నుకొనిరను సంగతి యాతని చెవులఁబడియెను. బాహుబలముచే రాజధాని నాక్రమించుకొని పితృసింహాసనము నధిష్ఠించుటకంటె నాతని కిఁక గత్యంతర మేమియును లేదు. ఆకారణమున నాతఁ డధికసంఖ్యాకసైన్యముం గూర్చుకొని ససైన్యముగఁ బాటలీపుత్రసమీపమునకు వచ్చి విడిసెను. చిరకాలము క్రిందటఁ బాటలీపుత్రము ప్రాకారపరిఖాద్వారములచే సురక్షితమైయుండెను. అశోకుని సేనానాయకులింతకుముందే ప్రాకారమునకుఁ జుట్టునున్న యగాధమగు నగడ్తను జలశూన్యముగఁ జేసి తుపాకిమందు కసవు మొదలగువానితోఁ గప్పివైచి యుండిరి. జలశూన్యంబును, దృణశోభితంబును నగునాపరిఖం గాంచి సుసీముఁ డానందోత్ఫుల్లహృదయుఁ డయ్యెను. పరిఖావరోధము లేకుండుటచే నెటుల

యినఁ బ్రాకారమును బగులఁగొట్టియో, లంఘించియో ససైన్యముగ నగరమధ్యమునందనాయాసముగఁ బ్రవేశింపవచ్చునుగదా యని యాతఁ డాశపడియెను. ఇట్టి యాశచేత నే యాతఁ డతివేగముగ సేనల నడిపించుకొని ప్రాకారసమీపమునకు వచ్చి నిలిచెను.

అశోకుని దండనాయకు లిది యంతయును గనిపెట్టి చూచుచునే యుండిరి. మహారణకుశలు రగువారి యుపాయము ఫలించినది. సుషీముఁడు ససైన్యముగఁ బ్రాకారమునకు నగరమును మధ్యభాగమునఁ బ్రవేశించి యుండెను. పంచాననము ప్రబల కిరాతునివలలోఁ దగులుకొన్నది. సుషీముఁడు ససైన్యముగ నట్లుండుటం గాంచి యశోకుని సైనికు లాపరిఖ యందలిమందునకు నిప్పు ముట్టించిరి. మఱియుఁ బ్రాకారములపైనుండి నిరంతర బాణవర్షమును గురియింపసాగిరి. సుషీముఁడు తా నెన్నఁడుఁ గలలోనైన ననుకోని యుపద్రవపన్నాగముఖంబడి ససైన్యముగ నివాతుఁడై పోయెను.

అశోకుని సౌభాగ్యమార్గమున కడ్డముగనున్న కంటకవృక్ష మీవిధముగఁ బెల్లగింపఁబడిపోయెను.

నవీనుఁ డగు రాజు—ప్రసిద్ధు లగు మంత్రులు—రణనీతికుశలు రగు దండనాయకులు— వీరందఱును యుద్ధానంతరమున నొక్కచోఁ గలిసికొనిరి; ఒక్కటే మాటగ మెలంగుచుండిరి; ఒక్కటే శరీరముగ భావించుకొనుచుండిరి. ఇఁక నట్టి రాజ్యమునకుఁ గొదవ యేమున్నది? అశోకున కప్పటికిని బ్రా

తృసంబంధశత్రుత్వము విశేషము కాలేదు. అశోకుఁడు కేవలము దకీకదృష్టితో విద్రోహులగుసోదరులను సపరివారముగ నశింపఁజేయుటకై ప్రయత్నించుచునే యుండెను. ఇట్టి కల్లోలములచే నశోకునకుఁ బితృసింహాసనము లభించినను బట్టాభిషేకము జరుగుట కాలవ్యయము కావలసివచ్చెను—

## పదునాలుగవప్రకరణము.

### రక్తప్రవాహము

అశోకునకు సర్వరాజ్యమును లభియించినది. ఆతని ముఖ్యశత్రువులు హతులైపోయిన సంగతియు సత్యమే. కాని యాతనికంతమాత్రమున నిశ్చింతుఁడై యుండుట కవకాశము కలుగలేదు. పూర్వమునుండియు రాజ్యమునందలిప్రజలును రాజోద్యోగులును రెండుపక్షములుగ నేర్పడి యుండిరి. కొందఱు అశోకునిపక్షమువారుగను, మఱికొందఱు సుషీమునిపక్షమువారుగను నుండిరి. అశోకునిపక్షమువారు ప్రబలులేయయ్యును గొలఁదిమందిమాత్రమే యుండిరి. ప్రజాసామాన్యమునఁ జాలమంది సుషీమునిపక్షమువారే యైయుండిరి. మానవలోక మెంతవికృతముగ మాఱిపోవుట తటస్థించినను, ధర్మాధర్మజ్ఞానము, న్యాయాన్యాయవిచారణశక్తి, పాపనిందనము, పుణ్యాకాంక్ష మొదలగుసద్గుణములన్నియు నొక్కసారిగ నాశనము లైపోవఁజాలవు. "సుషీముఁడు యువరాజుగ

నుండెను—సత్యకర్మానుసారముగ నాతఁడు పిత్రసింహాసనముకు నుత్తరాధికారి యైయుండెను. బాల్యచాపల్యముచేనైన లోపము లాతనికడ నేవియైన నుండిన నుండుఁగాక! సమయానుకూలముగ వానినెల్లటి నాతఁడు సవరించుకొనఁజాలక పోఁడు' అని యీవిధముగ భావించుకొనుచుఁ బ్రజలలోనను మంత్రులలోను జాల భాగమువఱకును సుషీముని యెడలనే యధికవిశ్వాసము కలిగెను. వారికశోకుఁడు రాజకుటుంబతోషకరముగ లేఁడు. ఇంతియకాక సర్వవిధముల రాజ్యార్హుఁడగు సుషీముఁడు కపటమార్గమున నన్యాయముగఁ జంపఁబడిపోయెను. అందువలనఁ బ్రజలలోఁ జాలమందికి సుషీముని యెడల జాలి కలిగెను. వారాతనిలోపముల నన్నిటిని మఱచిపోయిరి. అందఱు నాతనికొఱకే తమవిచారమును సూచించుచుండిరి — పతిపుత్రవిహీనలును, మహారాజమహిషీమణులు నగునశోకుని సవతితల్లులయెడలఁగూడఁ బ్రజాభిప్రాయము సానుభూతముగ నుండెను. ప్రజ లందఱును వారికష్టములకు విచారించుచుండిరి. ఇట్టి కారణములచే ననేకు లశోకునకు బహిరంగశత్రువులే పోయిరి. ఇంకను మిగిలియున్న యశోకుని వైమాత్రేయ సోదరులుకూడ నాతనియెడల విరుద్ధాచరణముల నాచరించుచుండిరి.

ఈసకలకారణములవలనను నశోకునకొక్క క్షణమును నెమ్మదియనుమాట లేదయ్యెను. అప్పు డాతఁడు దేవపథముచే

నైనను శత్రుసంహారము చేయువలయు నని కృతసంకల్పుం
డయ్యెను. ఆతఁడనేకు లగుగూఢచారులను నియమించి
యుంచెను. వారందఱును జూదశాలయములు, దేవాగారము
లు, సైన్యావాసములు, పుణ్యక్షేత్రములు, మొదలగునానా
ప్రదేశములనానావేషధారులై సంచరించుచునానాసమాచా
రములను సంగ్రహించుకొని వచ్చి యశోకునకు నివేదించు
చుండిరి. ఎవ్వరెచ్చట నేవిధముగ రాజద్రోహకార్యములం
జేయవలయు నని యాలోచించుకొనుచుండిరో యంతయు
నశోకున కతిగూఢముగఁ దెలిసిపోవుచుండెను. క్రమముగ
నెందఱో రాజద్రోహులు రాజ్యమునందు నిండియున్నట్లు తె
లియవచ్చెను. రాజపరివారమునందుఁగూడ ననేకులనామము
లావిద్రోహనామసహితములై వినఁబడుచుండెను. ఆకాలము
నందు రాజద్రోహాపరాధులకు మరణదండనముకంటె మఱి
యొకశిక్ష యేదియును లేదు. రాజద్రోహులసంఖ్య వృద్ధి
యగుచున్నకొలందిని నరహత్యలసంఖ్యకూడఁ బ్రవర్ధిల్ల నా
రంభించెను. క్రమముగ నీనరహత్యల కొకవిశాలావాసము
కూడ నిర్మింపఁబడియెను. ఆగృహమునకు నరక మని పేరు
పెట్టఁబడియెను. పొరబాటుననో, కాక గూఢచారులయసత్య
సమాచారమూలముననో గాని యొకనాఁడొకబౌద్ధసన్న్యాసి
యాహత్యాగారమునఁ బ్రవేశపెట్టఁబడియెను. చండగిరికుఁ
డనుసాలెవాఁడొకఁడు రాజద్రోహులశిరంబుల ఖండించు
కార్యమునందు నియుక్తుఁడై యుండెను. ఆతఁ డప్పు డందఱ

వలెనే యాసన్యాసిఁగూడ నఱకుటకు సన్నద్ధు డయ్యెను; కాని యాసాధు వేమేమియో చెప్పుటవలన నాచండగిరికుఁడాతనికిఁ గొన్నిదినములు గడువిచ్చెను. ఈగడువులోపలనే యాబౌద్ధపరివ్రాజకుని యపారయోగబలమాహాత్మ్యము ప్రకటిత మయ్యెను. ఆసంగతి యథాసమయమున మహారాజగునశోకుని చెవులఁ బడియెను. తోడనే యశోకుఁడు స్వయముగ నచ్చోటికిఁ బోయి యాసాధుశేఖరుఁడు నిరపరాధి యని సప్రమాణముగ గ్రహించుటయే కాక యాతఁడు మహాయోగి యని కూడఁ దెలిసికొనియెను. అప్పుడశోకుఁ డాతనికి నమస్కరించి తన యపరాధమును క్షమింపఁ బ్రార్థించి యా మహాత్ముని విడుదల చేయించెను. అప్పు డా రఘాతుకుఁ డగు చండగిరికుఁడు తానదివఱకుఁ జేసిన మహోద్ధతకార్యములంగూర్చి యశోకునకు విన్నవించెను. నిందనీయంబగు నీవ్యాపారమంతయు నప్పుడశోకునకు రాక్షసకృత్యముగ నగపడియెను. తత్క్షణమే యశోకుఁ డాహత్యామందిరము భస్మీభూతముగఁ జేయవలయునని యాజ్ఞాపించెను. అది మొదలుగ రాజద్రోహులకు మరణదండనము తప్పిపోయినది; అట్టివారిని వారియపరాధములకుఁ దగురీతిని దండించుట యారంభ మయ్యెను.

అదియే కారణముగా నంతటినుండి నవీనసార్వభౌముఁడగు నశోకుఁడు బౌద్ధయతులవలన బౌద్ధధర్మములను మఱియు ననేకపుణ్యచరిత్రములను వినుచుఁ గ్రమముగా

బౌద్ధపరివ్రాజకుల యోగబలమాహాత్మ్యములంగూడ స్వయముగఁ జూచి తెలిసికొనుచుండెను.

అశోకుని రాజ్యలోభకారణమున రాజ్యరక్షణమునకై యనేకులగు నపరాధులును, నిరపరాధులును, శత్రువులును, మిత్రులును, స్వజనులును, పరవారునుగూడఁ గత్తులకత్తులపాలయి పోయిరి. రక్తప్రవాహములతో నాలుగుసంవత్సరములీవిధముగఁ గడచిపోయినవి.

---

## పదునేనవప్రకరణము.

### అభిషేకము.

మహారాజగు బిందుసారుఁడు లోకాంతరగతుఁడై యిప్పటికి నాలుగేండ్లయ్యెను. రాజలోభపరవశుఁడైయున్న యశోకునకుఁ బితృమరణదుఃఖంగూర్చి దుఃఖించుట కెప్పుడు నించుకంత యవకాశము దొరకినదికాదు. అతఁడు తన రాజ్యరక్షణమునకై సోదరులనైనఁ జంపించుట కెంతమాత్రమును శంకించియుండలేదు. ఎందఱో భ్రాతలను, మఱియు నెందఱో పురజనులనుగూడ సంహరించి యాతఁ డిప్పుడు నిరపాయుఁడై నిష్కంటకుఁడై యున్నాఁడు. ఇన్నాళ్ళకాతని కాపాటలీపుత్రమున— ఆరక్తరంజితమందిరమునఁ బట్టాభిషేకమహోత్సవము గావింపవలయు నని యాలోచనతోఁచెను. రాజధర్మము—రాజచరిత్రము ఎంతవిచిత్రమైనది!!!

సర్వసంతాపసంహారకం బగుసమయము. ఈనాలు గేండ్ల గ్గనను రాజాంతఃపురమునందలి యనేకులు తమశోక తాపములను మఱచిపోయియుండిరి. నగరమున శాంతి నెల కొల్పబడినది. నాగరకులు మరల సుఖసంతోషములచే నుల్లసితహృదయులను సంచరించుచు రాజపథశోభాపరంపరల వరిలఁజేయుచుండిరి. శాంతిప్రియులును, సుఖప్రియులు నగు నగరజనులహృదయములయందు మరలరణభేరీనాదము చెవులఁబడుటతటస్థించునేమోయను సందేహమైన నుదయించుట లేదు. ఇప్పుడు సంధ్యాసమీరణములచే నగరతోరణస్తంభములయందలి విజయపతాకలు సవిలాసముగ సంచలితము లగుచుండెను. విజయభేరీమధురనినాదములును, బూర్వవాహిని యగు జాహ్నవీతరంగకలకలనినాదంబులును గలసిమెలసి యపూర్వసంగీతస్వనంబును బ్రదర్శించుచుండెను. సంధ్యాసమయదీపమాలికలును, దిగంతవ్యాప్తంబు లగు విజయభేరీనినాదములును, కలకలనినాదినియు, మందగామినియు, నగు జాహ్నవీతరంగిణియందలి జలశీకరంబులచే నభిషిక్తంబు లగు వాతపోతంబులును, వారిని వీక్షించుశోభితంబుల స్పృశించుచు వారిపూర్వపుసంగతుల నన్నిటిని మఱపించుచుండెను. రాజాంతఃపురమునందలి పతిపుత్రవియోగదుఃఖిత లగు కొందఱు రాజమహిషులును నగరమునందలి ప్రతిహింసాపరాయణులును బలవంతులు నగు కొందఱు జనులునుమాత్రము గాక తక్కిన జనసామాన్య మంతయు బిందుసారుని

మాటయు, యువరాజగు సుషీముఁడు మొదలగు నితరభ్రాతృవరుల హత్యలును, గాజగుప్తుని కౌటిల్యచరిత్రమునుగూడ సంపూర్ణముగ మఱచిపోయిరి. సాధారణజనులు తమతమ వ్యాపారములు క్రమముగ జరుగుటయే చూచుకొనువారు కావున వారి కీయాలోచనయే లేదు. వారి సమపాయములకు లోపములేకుండ నున్నప్పుడే రాజ్యము నేరాజు పాలించిన వారికేమి? న్యాయాన్యాయవిచారణచర్చయుఁ, బ్రతిహింసాచరణాలోచనయుఁ జాలకాలమువఱకు వారిహృదయముల యందు మెఱయుచునే యుండెను; కాని నాలుగు సంవత్సరములు భయంకరముగ శోణితవాహినులు ప్రవహించినతరువాత వారికి మరల మంచికాలము వచ్చినది. ఇప్పు డారాజ్యమునందలి ప్రజ లందఱును ముక్తకంఠులయి కౌముదీపులకితం బగు నారాత్రియందు విమలచంద్రికారంగమునందుండి యుచ్చైస్స్వరమున నీవిధముగ సాధువాదములం గావించుచుండిరి—"జయమగుఁగాక! మహారాజగు నశోకునకు జయమగుఁగాక!" రాజమందిరమునందును, సమున్నతప్రాసాదములయందును, ప్రకోష్ఠములయందును, మందిరములందును, మతములందునుగూడ నావిజయనాదములే ప్రతిధ్వనించుచుండెను—"జయమగుఁగాక! మహారాజగు నశోకునకు జయమగుఁగాక!"—అది జ్యేష్ఠమాసము. శుక్లపక్షము. పంచమీతిథి—సార్వభౌముఁ డగు నశోకుని పట్టాభిషేకక్రియలు సర్వమును సంపన్నంబు లయ్యెను.

---

## పదునాఱవప్రకరణము.

### దిగ్విజయము.

సార్వభౌముఁడగు నశోకుని ప్రతాపము దశదిశాపరివ్యాప్తమయ్యెను. సమస్తసామంతమహీపాలురు నాతనిసార్వభౌమత్వము నంగీకరించిరి. ఆతనిబాహుబలపరాక్రమము లందఱకును బరిచితములయ్యెను. ఆతని చతురంగబలములు దినదినప్రవర్ధమానము లగుచుండెను. వారు కేవలము రాజ్యము శాంతిరక్షణముఁ గావించుటచేత నే తృప్తివహించియుండుటలేదు. పశుబలము ధర్మబలముచే నియమితమును సంయతమును గాకున్నచో నది క్రమముగ ధర్మబలమును మించి యతిక్రూరముగఁ బరిణమింపఁగలదు. సేనానాయకు లాసంగతిని బాగుగ గ్రహించియుండిరి. మంత్రిగణముకూడ గ్రహించి యుండెను. ఇప్పటికి నాలుగుసంవత్సరములనుండి మహారాజు యుద్ధవిగ్రహములలోనే మునిఁగి యుండెను. శాంతి వహించి యెంతయో కాలము కాలేదు. ఇప్పుడు మరల దిగ్విజయార్థమై యుద్ధయాత్ర చేయవలయు ననిన సైనికులకుఁ గష్టముగ నుండును. ఈసంగతులన్నియు నాలోచించుకొని వారు మహారాజు చెప్పినటు చేయవలయు నని నిశ్చయించుకొనిరి. వారెల్లసంగతులును విస్పష్టముగ నశోకసార్వభౌమునకుఁ దెలియఁజేసిరి. అశోకుఁడు దిగ్విజయయాత్ర

చేయుటకు నిశ్చయించెను. కొలఁదికాలములోనే యందులకుఁ గావలసినప్రయత్నము లన్నియు సంపూర్ణము లయ్యెను.

మగధదేశాధిపతి యగు నశోకమహారా జప్పుడు కళింగదేశవిజయమునకై విశేషసేనాపరివృతుఁడై యుద్ధయాత్ర చేసెను. వర్తమానకాలమునను త్కళము (ఉరియా) అను పేరు గల మదరాసు రాజధానియందలి కొంత కాల మప్పుడు కళింగదేశముగ వ్యవహరింపఁబడుచుండెను. కళింగదేశము నీలసముద్రసేవితమై యుండెను. ఆదేశమధ్యమునుండి వైతరణీ తరంగిణి ప్రవహించుచుండెను. నీలాచలము మొదలగుచిన్న పెద్దపర్వతముల వరుస లీదేశమున వ్యాపించి విరాజమానము లగుచుండెను. అప్పటిసముద్రము, నదులు, పర్వతపంక్తులు నిప్పటికి నా దేశమును సురక్షితముగఁ జేసి యుంచుటచే నా దేశము నాక్రమించుకొనుట శత్రువులకు దుస్సాధ్యముగ నుండెను. మఱియొకవిశేషము— ఖరస్రోతానది యా దేశము కడవఱకును వ్యాపించియుండుటచే శత్రువులకు దుష్ప్రాప్యమై యుండెను. రఘువంశకావ్యమునందలి రఘుమహారాజు దిగ్విజయభాగమును జదివినచో మనమీవిషయములన్నియు సప్రమాణముగ గ్రహియింపఁగలుగుదుము. అయోధ్యానాయకుఁడగు రఘుమహారాజు వంగదేశము నతిక్రమించి మదమాతంగములతో సేతువు నిర్మించి కపిశానదిని ససైన్యముగ దాఁటియున్నాఁడు.

క॥ "బలయుతుఁడు రఘువు నౌకా
బలసంపన్నులగువంగ • పతులఁ గెలిచి ని
ర్మలగంగాస్రోతంబుల
నలవున నాటించె ఘనజ • యస్తంభములన్."

× × × × ×

"ఏనుఁగుల సేతువులఁ గపి
శానదిఁ దరియించి రఘుఁడు • చనియెఁ గళింగ
స్థానమునకు జయభటసం
తానముతో నుత్కళపథ • దర్శితపథుఁడై."

రఘుమహారాజు దిగ్విజయయాత్రఁ జేసినమార్గము న నుసరించియే మగధాధిపుఁ డగునశోకమహారాజుకూడ విపులసైన్యముతోఁ గళింగమునకు గమనోద్యతుఁ డయ్యెను.

అప్పటికళింగప్రభుఁడు సామాన్యముగ నశోకునకు లోఁబడలేదు. ఆకారణముచే నిరువంకల సేనలకును మహారణము జరిగినది. కరితురంగపదాతిగణంబుల పదాఘాతములచేఁ బ్రభవించినరజఃపటల మాకాశమును గప్పివైచెను. రథనేమినిస్వనంబులును, గజబృంహితధ్వనులును, హయహేషలును, వివిధాయుధఘుణఘుణారావంబులును గలసి సాగరతరంగనిర్ఘోషమును స్తబ్ధీభూతముగఁ జేసివైచెను. రణధరణీతలమున శోణితవాహినులు ప్రవహించెను. ఈవిధముగఁ గొన్నిదినములు గడచినపిమ్మట యుద్ధము ముగిసెను. ఆవిశాలజనపద మంతయు నశోకునియధీన మయ్యెను. కాని దే

శము జనశూన్యమైపోయెను. అప్పు డశోకుఁడు రథారూఢుఁడై రణక్షేత్రమును బరీక్షించెను. ఆబీభత్సదర్శనమున నాతనిహృదయ మత్యంతవ్యాకులిత మయ్యెను. ఆకారణముచే విజయలక్ష్మి యాతని కుల్లాసము కలిగింపఁజాలకపోయెను. ఇంతియకాదు — ఆతనికించుకంత యూఱటయైనఁ గల్పింపలేకపోయెను. తనరాజ్యలోభముచే ననేకజనసంఘములు నాశనములైపోయెఁగదా యని యప్పు డాతఁడు దుఃఖించెను. అందుచే నాతఁడు మర్మభేదనంబగు విచారము ననుభవించెను. కాని యూఁడా యాంతరికవేదన మెవ్వరియెద్దను బ్రకటించియుండలేదు. తదనంతర మాయశోకుఁడు కళింగరాజ్యసింహాసనమునందు ద్రాప్రభువునే మరలఁ బ్రతిష్ఠించి దేశపరిపాలనమున కనుకూలవ్యవస్థలు గావించి స్వదేశమునకు మరలెను. కొలఁదికాలమునకే యశోకుఁడు రాజధానిం బ్రవేశించెను. అప్పుడు రాజధానీనగరమున యథావిధిగ విజయోత్సవములు గావింపఁబడియెను.

---

## పదునేఁడవప్రకరణము.

---

### సంధిసమయము.

పాటలీపుత్రమునఁ గొన్నిదినములవఱకును విజయోత్సవములు జరగినవి. క్రమముగా నుత్సవోచ్ఛ్వాసములు తగ్గనారంభించెను. ఆనందతీవ్రప్రవాహములు మందీభూత

ములగు నుండెను. గజతురంగపదాతిగణంబులకిక నిప్పుడు యుద్ధయాత్రానుభావంబు లగువేషభూషణములు లేశమాత్రమును లేవు. నగరతోరణములయందలి పత్రపుష్పమాలికలు వాఁడిపోయినవి. పట్టణమంతయుఁ బూర్వమువలె నెమ్మదితో నుండెను. దూరమునుండి రణభేరీధ్వనుల నాలకించి యుద్ధయాత్రామహోత్సవముం జూడవలయు ననునుత్సాహముతోఁ గులవధూజనము గృహకార్యములనువిడిచి గవాక్షములయొద్ద నిలిచియుంటలేదు; వృద్ధులగువార లింటిముంగలి దాటివచ్చుట లేదు. యౌవనులు స్వకార్యములను వదలి వీథులవెంటఁ దిరుగుట లేదు. బాలకులు తమపుస్తకములను బాఱవైచి వీథులలోనికిఁ బరుగెత్తుకొని వచ్చుట లేదు. ఇప్పుడు నగరజనులందఱును నెమ్మదితోఁ దమతమపనుల నిర్వహించుకొనుట కారంభించిరి. రాజధానియందును రాజాస్థానమునందును మరలఁ బూర్వావస్థ నెలకొనియెను.

రాజ్యమంతటను బ్రజలందఱును బూర్వరీతిని నెమ్మదితో నుండిరి. కాని మహారాజగు నశోకుని మనోభావము మాత్రము యథాపూర్వముగ నున్నట్లగపడుట లేదు. ఇంతకాలమువఱకు మహారాజగు నశోకుఁ డెట్టిస్థితియందుండెనో యితరులుకూడ నాస్థితియందే యుండిరి. తనహృదయమునం దెట్టివిషయచ్ఛాయ ప్రసరించుచుండెనో యింతకాలమువఱకు నశోకుఁడు గ్రహింపఁజాలకపోయెను. ఆమహారాజు ముఖమండలమున నాఛాయ వ్యాపించి యున్నట్లితరులుకూడ నెవ్వ

రును గనుపెట్టలేకపోయిరి. ఇప్పుడు ప్రజలకందఱకును మంచి సమయము వచ్చినది. అందుచేతనే యశోకుఁడు తనప్రాద యమును బరిసరించియున్న విషమచ్ఛాయను బాగుగ గ్రహింపఁగలిగెను. మంత్రులుకూడ నాసంగతిని దెలిసికొనఁ గలిగిరి. మహారాజగు నశోకుని వాక్యోపవాక్యములవలనను, నాహారవిహారములవలనను, నాచారవ్యవహారములవలనను, నాదేశోపదేశములవలనను నాతనిభావవైలక్ష్య మెల్లరకును స్పష్టముగ బోధపడుచుండెను.

క్రమముగ మంత్రులందఱు నీవిషయముంగూర్చియాలోచింప నారంభించిరి. ఒకనాఁడు మహారాజు దైనందినరాజకార్యములు నిర్వర్తించుకొని సభచాలించి నగరునకుఁ బోయెను. తరువాత కొలఁదిసేపటిలోననే మంత్రులందఱు నాస్థానమునుండి వెలుపలకు వచ్చిరి. వారిలో నొకఁడు 'అంతఃపురమునందేదియో జరిగియుండును' అనియెను. మఱియొకఁడు 'అటుకాదు. నేను వినియుంటిని. చండగిరికుకృత్యముల కాతఁడు మిగుల గోపిష్ఠుఁడై యున్నాఁడు. ఆచండగిరికిఁ దొకనాఁడు నిరపరాధియు, నలౌకికశక్తిశాలియు నగు సముద్రుఁడను నొకబౌద్ధసన్యాసిని జంపఁబోయెను. కాని యాతని యమానుషశక్తింజూచి విస్మితుఁడును భయావహుఁడునై యావృత్తాంతమును మహారాజునకెఱింగించెను. మహారాజు స్వయముగ నరకగృహమునకు వచ్చి యాసన్యాసియత్యద్భుతమహిమలను గన్నారఁగనుఁగొని యాతని నంద

ర్శించెను. ఆతనియొద్ద బౌద్ధధర్మముం గూర్చి వినియుండెను. ఆపిమ్మట నేనరకమందిరము నేలమట్టమైపోయినది. చండగిరికునకుఁ బ్రాణదండనము విధింపఁబడినది. అప్పటినుండియు మహారాజునకు మనసు తిరిగిపోయినది' అనియెను. అంతట మఱియొకఁడు 'ఇదియే సత్యమైయుండును' అని యాతనివాక్యములను సమర్థించెను. మరల నాతఁడు తక్కినమంత్రివర్గముం జూచి 'మహారాజు కళింగదేశ యుద్ధక్షేత్రమున నసంఖ్యజనక్షయముం గాంచి యతివికలహృదయుఁడయ్యెనని యు, నికనెన్నఁడును రాజ్యలోభముచే యుద్ధము చేయఁగూడదని నిశ్చయించుకొనియెనని యుఁ బ్రధానదండనాయకుని వలన నేను వినియుంటిని. రాజధర్మము సూక్ష్మతమమైనది. రాజనీతి కృత్రిమమైనది— సరళభావముతో సకలవిషయములను బరిదర్శించుట యీరెంటికిని విరుద్ధము. కేవల మెల్ల విషయములను బాహ్యదృష్టితోఁ జూచుటయే యావశ్యకము. కాని యంతమాత్రమున నేనుగుదును? మహారాజునొద్ద నిరంతరము నుండు సప్రధానవర్తులకుమాత్రమే యాతని మనోభావములు బోధపడుచుండును. అట్టివారియొద్ద నాతఁడు తనమనోభావముల నెట్లు దాఁపఁగలుగును? మనోభావములు ముఖమునందును మాటలయందును బ్రకాశితము లగుచునే యుండును' అనియెను.

ఆనాఁడు మంత్రులీవిధముగ నాలోచించుకొని తమతమ వాహనముల నధిరోహించి మందిరములకుఁ బోయిరి.

అనంతర మొకనాఁ డశోక సార్వభౌముఁడు తనవిలాససౌధమున వాయువిహారముచేయుచు జాలకాంతరములనుండి వీథిని బోవుచున్న పరమసుందరుఁ డగునొక బాలకుని జూచెను. ఆ బాలకుని శిరస్సు ముండితమై యుండెను. ఆతఁడు కాషాయ వస్త్రములను ధరించియుండెను. ఆతనిహస్తమునఁ గమండలువుండెను. మృణాళసదృశంబులును, కోమలంబులును, సువృత్తంబులు నగు నాబాలకుని బాహువులు కావివసనముచేనర్ధావృతములై యుండెను. అందుచే నాబాలకునిశరీరకాంతి మఱింతస్పష్టముగను దేజోవంతముగను గానవచ్చుచుండెను. ఆతనిముఖమండల మపూర్వతేజస్సంపన్నమైయుండెను. ఆతనివిశాలనేత్రద్వయమునుండియు హృదయనిర్మలానందమును సంసిద్ధకరుణామృతభానమును బహిర్గతము లగుచుండెను. అశోకుఁడు చాలసేపటివఱకు నాబాలకుని దదేకదృష్టితోఁ జూచుచుండెను. ఆబాలుఁ డప్పుడు తనలో నేమేమియో పాడుకొనుచుఁ బోవుచుండెను. ఆతనినింకను జూడవలయుననియు నాతనిగానము బాగుగ నాకింపవలయుననియు మహారాజు మిగులఁ గుతూహలపడియెను. అప్పుడొక సేవకున కాజ్ఞాపించుటచే సేవకుఁ డాబౌద్ధబాలసన్న్యాసి నచ్చటకుఁ దీసికొనివచ్చెను.

మహారాజు పరమాదరముతో నాబాలయోగి నుచితాసనమునఁ గూర్చుండఁజేసెను. ఆతని యోగక్షేమములం దెలిసికొనియెను. అప్పుడాబాలయోగి తననామము నిగ్రో

ఘుఁడనియుఁ దనగురుని పేరు తిష్యుఁడనియుఁ దెలియఁజేసి యాకింది విధముగ గానము సేయఁదొడంగెను. దాని భావ మిది:—

“జీవునకు దేహము గేహమువంటిది. దేహస్థావంబగునీగృహమును నిర్మించినతృష్ణఁ గూర్చి యన్వేషించుచు నేననేక పర్యాయము లీజగంబునకు వచ్చియుంటిని. అనేక జన్మములను గ్రహించియుంటిని. మరలమరల నెల్లకాలమును జన్మాంతరముల నందుచుండుట యెంతదుఃఖకరము! ఓగృహనిర్మాణకారిణీ! నేఁడిప్పటికి నిన్నుఁ బ్రత్యక్షముగఁ జూడఁ గలిగితిని. ఇఁకనీవు మరల నీగృహమును నిర్మింపఁజాలవు. గృహస్తంభములను, బార్శ్వదండములను గూడ సంపూర్ణముగ నేను భగ్నము చేసివైచితిని. సంస్కారరహితంబగునాహృదయ మిప్పటికిఁ దృష్ణాక్షయసాధనమును గ్రహింపఁగలిగినది”

ఆబాలయోగి గానరూపబోధనమువలన నామహారాజుహృదయమున మఱపునఁబడిపోయిన యెన్నియోసంగతులు స్మృతికి వచ్చుచుండెను. ఆతనిప్రాణములు చేతనారహితములై పోయెను. అప్పుడేమిచేయవలయునో యాతని కేమియుఁ దోఁచుట లేదు. బాలకుఁడు మరలమరలఁ బాడఁ దొడంగెను— “లెమ్ము! అలసుఁడవై యుండఁబోకుము. ధర్మాచరణము నాచరింపుము— ధర్మాచరణుఁడిహలోకమునందును బరలోకమునందును గూడ సుఖయింపఁగలఁడు. సత్కర్మములను జేయుము! అసత్కర్మములను జేయవలదు.

ధర్మచారియగువాఁ డిహపరలోకములయందు సుఖమైయుం డఁగలఁడు.'

మహారాజగు నశోకుని హృదయమునందుఁ గింకర్తవ్యతావిమూఢత్వము వదలిపోయినది. అతని హృదయమునుండి సందేహాంధకారచ్ఛాయయు పరిదీపాంధకారచ్ఛాయయును గూడ నశించిపోయినవి. ఆతఁడు తనజీవితమును బౌద్ధధర్మప్రచారమునందే గడపవలయు నని నిశ్చయించుకొన్నసంధిసమయ మిదియే.

---

## పదునెనిమిదవపరిచ్ఛేదము.

### నవజీవనము.

"ప్రాణమును రక్షింపవలసివచ్చినచోఁ బ్రాణదానమునే చేయవలయును." అనరత్వము నాపాదించు సనాతన మిదియే. మృత్యుమధ్యమునుండియే యమృతమును బొందుట— భోగమునందు లభియింపనిదికూడఁ ద్యాగమునందు లభియింపఁగలదు—సంభోగమున లేని సుఖము సంయమమునందున్నది. విలాసమున దుర్లభమైనయానందము విరాగమున సులభమైయున్నది. కాని యీసంగతి యందఱు నెఱుఁగరు. ఎఱిఁగినను గ్రహింపఁగలిగినవారు కొంతమంది మాత్రమే—గ్రహించినను విశ్వాసముతోఁ బనిచేయువారు చాలఁదక్కువగా నుందురు.

రాజభోగములును, విలాసవిభవములును నపరిమితములే యైయున్నను వానియం దశోకునకుఁ దృప్తి లుగలేదు. ఆతని హృదయము విలాససుఖంబులఁ గేలి సేయుచున్నను విచారించుచునే యుండెను. ఆకారణముచేతనే యాతఁడు తనపాలితులను బౌద్ధధర్మములకుఁ బూజోపహారములుగఁ జేసివైచెను. అందువలన నప్పు డాతనికి నవజీవనలాభము కలిగెను.

ఆనవజీవనమునం దాతఁడు నవనవజ్యోత్స్నాంతరాళమున నవనవాదర్శములం జూడఁగలిగెను. ఆతని కప్పుడు కర్తవ్యము బోధపడియెను. ఆనూత్నవిజ్ఞానతేజస్సాహాయ్యముచే నాతఁడు ముందుగఁ దనగృహమున సంస్కరణమున కారంభించెను. జీవునకుఁ బ్రేమసంయోగము లభించినది. నిరంతరముఁ దన యాహారమునకై యనేకములగు మృగములును, బక్షులును సంహరింపఁబడుచుండుట నాతఁడు కనుంగొనియెను. ఉదరపోషణమునకై యించుక యన్నమును జలమును లభించినచోఁ బరితృప్తినందవచ్చునని యాతఁడు భావించెను. "అందుకొఱకు జీవహింసచేయుట యెందులకు?" అని ప్రశ్నించుకొనియెను. పిమ్మట మహారాజగు నశోకుఁడు తనయాహారముకొఱకు మృగపక్షిమారణము గావింపఁగూడదని యాజ్ఞాపించెను.

రాజానందముకొఱకును, మంత్రుల సంతోషముకొఱకును నిత్యనూతనంబులగు చిత్రవిచిత్రఖేలనములు జరుగు

చుండెడివి; అందుకొఱకై విశాలప్రాంగణమునఁ బహుపక్షి
మృగాదుల ద్వంద్వయుద్ధములు జరగుచునుండెడివి. ఒక్కొ
క్కప్పుడు దుర్గాంగములగు సింహములతోడను, మదగజముల
తోడను, క్రూరశార్దూలములతోడను, ప్రబలవృషభముల
తోడను నపరాధులగు ప్రజలను బోట్లాడించి వారిబలపరిమా
ణములు గ్రహింపఁబడుచుండెను. ఈసకలవినోదవ్యా
పారములును దట్టతునకేమైనవో మనము సులభముగ గ్ర
హింపఁగలము. ఒకప్పుడట్టివిలాసక్రీడ లానందదాయక
ములుగనే యుండెను. ఇప్పుడా కాలము తిరిగిపోయినది. నూ
తనతేజమునందు విస్పష్టముగఁ గానవచ్చుచున్న యార్తులయ
శ్రువర్షములును శిక్షితులరక్తప్రవాహములును నాతని కస
హ్యపరివేదనముం గల్పించుచుండెను. ఆతనికరుణార్ద్రహృ
దయమునందు సర్వభూతసమానుభావ ముదయించెను. ఇఁక
నాతఁడు చూచుచు నూరకుండఁజాలకపోయెను. అదిమొద
లుగ నామహారాజు నిష్ఠురంబులును, నిర్దాక్షిణ్యంబులు నగు
నట్టికౌతుకక్రీడలను నిలిపివేయున ట్లాజ్ఞాపించెను.

ప్రేమావతారుఁ డైనబుద్ధదేవుని ప్రియశిష్యుఁడగు
నశోకుని హృదయమునఁ బ్రేమశక్తి యుదయించినది. ఆశ
క్తియే మహారాజుపాకశాలను, ప్రాసాదములను, ప్రాంగణ
ములనుగూడఁ బరిశుభ్రపఱచి రాజ్యమందంతటను వ్యాపించి
పరిపాలింపనారంభించెను. మహారాజగు నశోకుఁ డిన్నాళ్ళ
వఱకును విహారార్థము వేఁటకుఁ బోవుచుండెను. ఆవేఁట

చాల నాశ్చర్యకరమైనది. ఇప్పుడు వేఁట యనిన గొందఱు వేఁటగాండ్రును, కొన్ని యేనుఁగులును, గొంతపరివారమును, గొన్నితుపాకులును బల్లెములును వెనుకఁ దీసికొనివచ్చెదరు. కాని మహారాజగు నశోకునికాలమునందుమాత్రము వేఁట మఱియొకవిధముగా నుండెను. అతఁ డొకప్పుడు బంగారుపల్లకి నెక్కియు, మఱియొకప్పుడు గజారోహణము చేసియు వేఁటకుఁ బోవుచుండెడివాఁడు. ఆతనివెంట ననేకులు నాయుధహస్తులగు సైనికులును, నమూల్యవేషభూషణాలంకృతలగు వారనారీమణులునుగూడఁ బోవుచుండిరి. చుట్టును బరివేష్టించియున్న రజ్జుమధ్యమునుండి వారందఱును నడచుచుందురు. ఆరజ్జుమండలముచుట్టును శస్త్రధారిణు లగు వీరనారీమణులు వేలకొలఁది తిరుగుచుందురు. దురదృష్టవశమునఁ దెలియక యం దెవ్వఁడైన నావీరనారీమణులు ధరించి వచ్చుచున్న యారజ్జుసీమ నతిక్రమించినచోఁ దత్క్షణమే యాతనికిఁ మరణదండన మగుచుండెను. ఈవిధము లగు నరహత్యలే విలాసక్రీడలుగా నున్నప్పు డిఁకఁ బశుపక్షిమృగాదులమాట చెప్పవలసిన దేమున్నది? మహారాజగు నశోకుఁడు బౌద్ధధర్మము నవలంబించినతరువాత నిట్టిదారుణసమారోహములనన్నిటిని రూపుమాపివైచెను. ఆతనిహృదయమునందలి కరుణాప్రవాహము మహారణ్యసీమవఱకును బ్రవహించుచుండెను. భయంకరారణ్యములయందలి జీవులుకూడ నిర్భయముగ సంచరించుట కవకాశము కలిగెను;

అశోకసార్వభౌముఁడు ప్రేమధర్మదీక్షితుఁడై క్రమ క్రమముగా నిట్టి భోగవిలాసములను, క్రీడాకౌతుకములను, వ్యసనములను గూడఁ బరిత్యజించివైచెను. భోగపరివర్తనమున సంయమన మారంభ మయ్యెను. నవజీవనలాభమునఁ జండాశోకుఁడు ధర్మాశోకుఁ డయ్యెను. బిందుసారసార్వభౌముని యప్రియపుత్త్రుఁ డిప్పుడు దేవతలకుఁగూడఁ బ్రియదర్శనుఁ డయ్యెను.

---

## పందొమ్మిదవ ప్రకరణము.

---

### పరివర్తనము.

ప్రియదర్శనుఁ డగు నశోకుఁడు నవజీవనలాభానంతరమునుండియు బౌద్ధధర్మస్థాపనమునకై విశేషప్రయత్నములను గావించెను. బౌద్ధధర్మములను సంస్కరించు నిమిత్తము మహాజనసభలం గూర్చి చర్చించుట యీవిధమగు ప్రయత్నములలో ముఖ్యమైనది. భగవానుఁ డగు బుద్ధదేవుని నిర్వాణానంతరమునఁ జాలమంది ప్రజలు సత్యధర్మమునకును, శాంతిలాభమునకును బుద్ధమతము నాశ్రయింపఁజొచ్చిరి. క్రమముగా నీభారతవర్షమున బౌద్ధధర్మమే ప్రబల మయ్యెను. దేశమునందలి గొప్పవారందఱును గూడ బౌద్ధులుగనే యుండిరి. రాజానుగ్రహము, రాజ్యసుఖశాసనములున్నుగూడఁ జాలవఱకట్టి బౌద్ధమతావలంబులగువారికే యనుకూలము

లుగ నుండెను. లోకులందఱును బౌద్ధశ్రమణులను మిగుల గౌరవించుచుండిరి. ఇట్టిసుఖానుభవముకొఱకును గౌరవము కొఱకును జాలమంది బౌద్ధధర్మము నాశ్రయించుచుండిరి. అనేకనీచబ్రాహ్మణులు శ్రమణవేషధారులైరి. అట్టివారు తమ బుద్ధికౌశల్యముచే బుద్ధమతప్రవర్తకు లగుజనులలో పిశ్వత్తాచారవ్యవహారరీతినీతుల వ్యాప్తము చేయుసాగిరి. ఆ కాలమున విశేషవ్యాప్తమైయున్న హిందూమతము కూడ నాబౌద్ధధర్మ విభేదము నించుకంత కనుపెట్ట నారంభించెను అశోకసార్వభౌముని రాజ్యకాలమునందుఁ బ్రప్రథమమున బౌద్ధమత మీవిధముగా నుండెను. అప్పు డుపగుప్తుఁ డనునాతఁడు బౌద్ధసమాజమున మతాధికారిగా నుండెను. ఆతఁడు స్థానగరిష్ఠుఁడును, బుద్ధభక్తుఁడు నైయుండెను. బౌద్ధశాస్త్రము నందాతని కసాధారణప్రజ్ఞ యుండెను. అతఁడు పవిత్రబౌద్ధమతముంగూర్చి యితరులుచేయుచున్న యపచారములం జూచి మహాత్మహతుఁడయ్యెను. ప్రచ్ఛన్నలగుదుర్వ్యాసీతుల ప్రబోధనములను మాన్పించుటకొఱ కాతఁడు సాధ్యమైనన్ని ప్రయత్నములను జేయ నారంభించెను. కాని, స్వార్థపరాయణులగునట్టి కపటవేషధారులనుబట్టి శాసించుట యాతనికి శక్యము కాకపోయెను. వారు చేయుచున్న విరుద్ధకార్యములం గనిపెట్టి శాసింపఁ జూచినప్పుడు వారు తమచాతుర్యమును జూపి తప్పించుకొనుచుండిరి. ఇది యంతయును జూచుచు వినుచు నేమియుందోఁపక యుపగుప్తుఁడు నిరాశవలనను విరక్తి

వలనను దనమతాధికారమును వదలుకొని యేకాంతవాసము చేయుచుండెను.

ఈసంగతులన్నియు నశోకమహారాజునకు యథాసమయమునఁ గర్ణగోచరము లయ్యెను. అప్పు డాతఁడు బౌద్ధభిక్షులను దురాత్ములనుండి యుద్ధరించుటకు సంకల్పించుకొనియెను. కపటవేషధారులగు మతవిరోధులను రాజ్యమునుండి పారఁద్రోలినచో నప్పుడు నిష్కంటకముగ మతప్రచారము కాఁగలదని యాతని కాశయు, విశ్వాసమును గలిగెను. ఈ యుద్దేశము ప్రకటించుటకై యామహారాజు తనయున్నతోద్యోగినొకనిని భిక్షుమండలసాన్నిధ్యమునకుఁ బంపించెను. రాజోద్యోగి వారికి మహారాజాభిప్రాయమును దెలియఁజేసెను. కపటాత్ములగు మతవిరోధులు చాలభయపడిరి. రాజోద్దేశమును నిరర్థకముగఁ జేయుటకో మఱియెందులకో గాని భిక్షుమండలమునఁ గొందఱుకొందఱు రాజోద్దేశమునుగూర్చి తీవ్రముగ నాలోచింపసాగిరి. ఇందువలన రాజోద్యోగికి విషమక్రోధము కలిగెను. ఆ కారణముం బట్టి యారాజోద్యోగి యాభిక్షులలోఁ గొందఱను వధించివైచెను. ఒకటి చేయఁబోయిన మఱియొకటి యయ్యెను. రాజోద్యోగి చేసిన దుష్కార్య మశోకమహారాజునకుఁ దెలిసినది. ఆతఁ డిప్పుడు ధర్మాసక్తుఁడై యున్నాఁడు; ఈభయంకరకార్యమునుగూర్చి మిగుల బరితపించెను. ఈయపరాధము తనదియే యని భావించుకొనియెను. ఏమనిన:— తానే యాయుద్యోగిని భిక్షుమండలి

మునొద్దకుఁ బంపియున్నాఁడు. ఆతనిఁ బంపకపోయినచో నిట్టి విపరీతము కలిగియుండదు గదా యని మహారాజగు నశోకుఁడు భావించుకొనుచు నస్థిరచిత్తుఁడయ్యెను. అప్పుడాతఁడే స్వయముగఁ బోయి భిక్షుగణముం జూచి 'ఈనరహత్యలవిషయమున నపరాధ మెవ్వఁడని?' అని ప్రశ్నించెను. కొందఱు రాజోద్యోగి యపరాధి యనిరి. మఱికొంద ఱట్టివానిని మా యొద్దకుఁ బంపుటచే మీరే యపరాధు లనిరి.

ఇట్టి భిన్నాభిప్రాయములమధ్యమున మఱికొందఱు 'చేసినపని మంచిదా చెడ్డదా? ఆనిమిత్తమున దోషియెవ్వఁడు? అను విషయముంగూర్చి విచారింపవలసివచ్చినచో నప్పుడు కర్తయభిప్రాయమును దెలిసికొనవలసియుండును.' అని చెప్పిరి. ఏమైన నేమి? ఈవిషయమున సూక్ష్మవిచారణ చేయుటకు మహాత్ముఁ డగునుపగుప్తుఁడే సమర్థుఁడు. మహారాజు పూర్వమునుండియు నుపగుప్తుని మిగుల గౌరవించుచుండెను. మఱియు భిన్నాభిప్రాయు లగుభిక్షులతోఁ దనయభిప్రాయ మేకీభవింపకపోవుటవలన నుపగుప్తుఁడు తనమతాధికారపథమును వదలుకొని పోయినసంగతికూడ మహారాజగు నశోకునకుఁ దెలియును. ఆయుపగుప్తుఁ డిక్కడకువచ్చినచో నెల్లవిషయములను సాధింపవచ్చునని యెంచి యశోకుఁ డాతనిఁ దనయొద్దకుఁ దీసికొనివచ్చున ట్లాజ్ఞాపించెను. కొంతమందిపోయి యాతని కాసంగతిఁ దెలియఁజేసిరి. అప్పుడుపగుప్తుఁడు భిక్షుమండలమునొద్దకు మరల వచ్చువిషయమునఁ దనయనిష్టము

ను సూచించెను. పరిత ప్త హృదయుం డగు మహారాజంతమా త్రింతో నూరకుండలేదు. అతఁడు మరల నాతని బలవంతముగఁ దీసికొనివచ్చుట కాజ్ఞాపించెను. అప్పు డుపగుప్తుఁ డేమియుం జేయఁజాలక త్వరలోనే వచ్చెద నని వార్తనంపించెను. అందువలన నశోకున కించుక యూరట కలిగెను. శాంతి

తరువాత నుపగుప్తుఁడు నౌకపైనుండి వచ్చుచుండె నని విని యశోకుఁడు గంగాతీరమునకు వచ్చి యతివినయముతో నుపగుప్తునిం దర్శించి నమస్కరించి యాతనిం దనతోఁ దీసికొని వచ్చి యొకసుసంపన్నంబగు సౌధమునం దాతనివిడియించెను.

ఉపగుప్తుఁడు నగరమునకువచ్చువఱకు నేమేమి చేయవలయునో మహారాజిదివఱకే యాజ్ఞాపించి యుండెను. రాజాజ్ఞననుసరించి యెల్ల కార్యములను సంపూర్ణములయ్యెను. ఇఁక నుపగుప్తుఁడు వచ్చుటయే మిగిలినపని. అతికష్టముచే నదియును బూర్తియైనది.

నిర్దిష్ట సమయమున కెల్లవారును సభామంటపమునకు వచ్చి యుండిరి. విశాలచంద్రశాలామంటపమున భిక్షుగణము కూడియుండెను. ఏవంకఁ జూచినను గాషాయవస్త్రధారులును ముండితశిరస్కులు నగుభిక్షులే యగపడుచుండిరి. ఆబుద్ధసన్యాసులకు మధ్యభాగమున నుపగుప్తుఁడు కూర్చుండి యుండెను. అతనిపార్శ్వమునందే మహారాజపీఠము వేయింపఁబడియెను. కాని యింకను నాపీఠము శూన్యముగనే యుండెను. అక్కడివారిదృష్టులన్నియు నాయుపగుప్తునివంకను. నశూ

వ్యసింహాసనమువంకను బ్రిసరించుచుండెను. అందఱును త్సాహముతో నుండిరి. ఆయాలస్యము వారియుత్సాహమున కింతగాయమును గూర్చుచుండెను. ఇట్టిసమయమున నాసభా మధ్యమునందించుక చలనచిహ్నము గానవచ్చెను. ప్రశాంతజలరాశి మృదువాయువేగ సంచలితమైనట్లుండెను. సంయతచిత్తులగు భిక్షుమండలములు భావతరంగవిలసితము లగుచుండెను. వారి నిర్వికారవదనఫలకంబుల నించుక ఉత్సాహలము, నించుక విస్మయము, నించుక ధైర్యమును గానవచ్చుచుండెను. క్రమముగ నాచంచలతరంగములు ప్రబలము లగుచుండెను. సభాసదు లెల్లరును లేచి నిలువఁబడిరి. అందఱి వదనములనుండియు "మహారాజు! మహారాజు!" అనుమాట లస్పష్టస్వరములతో వెలువడియెను. అందఱును మహారాజు దర్శనమునకై తొందరపడుచుండిరి. కాని మహారాజెక్కడ? మణిభూషణవిరాజితుడును గిరీటాలంకృతుడును దండపాణి యునగు మహారాజేడీ?— ప్రతినిమిషమును నిరాశావిస్మితమగుచుండెను. ఆసమయమునందు దొకప్రాచీన భిక్షు పార్శ్వస్థుఁడగు నవీనభిక్షుని వ్రేలితోఁ జూపుచు నందఱును "ఇతఁడే! ఆనిపార్శ్వమునందున్న యీతఁడే!" అని యస్పష్టస్వరంబునఁ బలుకనారంభించిరి. విలక్షణాకారుఁడగు నొకపురుషుఁడు సామాన్యాకృతితో ససంభ్రముఁడై యందఱకు నమస్కరించుచు నాశూన్యాసనమువైపునకు వచ్చుచుండెను. ఆ పీఠమును సమీపించి యాతఁడు ధర్మాచార్యుఁ డగు సభాపతి

కభివాదనముం గావించెను. ధర్మాచార్యుఁ డగునుపగుప్తుఁ డప్పుడు లేచి యాతని నభివందించి యాశీర్వదించి తనపార్శ్వమునందున్న శూన్యాసనముపైఁ గూరుచుండు మని చెప్పెను. సభాసదు లందఱు ననిమేషనయనులై యానూతనాగంతుకపురుషునిం జూడ నారంభించిరి. నీలవర్ణంబును, విలక్షణంబును నగు నాతని యాకారము నెవ్వరు నానవాలుపట్టలేదు. ఆ నవాగతపురుషుని యపూర్వవదనశోభయు, నలోకసామాన్యతేజోవిలసితనయనద్వయవిరాజితంబగు వదనమండలమును జూచి యందఱును విస్మితులైపోయిరి. ఆపురుషుని ప్రతిదృష్టిక్షేపణినుండియు నపూర్వరాజతేజఃపుంజములు ప్రకాశితము లగుచుండెను— మహారాజు పీఠమునలంకరించెను. సభ్యులెల్లరును దమతమపీఠములపై నిశ్శబ్దముగఁ గూర్చుండిరి.

పంచేంద్రియవ్యాపారమంతయుఁ గన్నులలోనే నిలిచియుండుటవలన సభ్యులం దెవ్వనికిని శబ్దస్పర్శరసగంధానుభవ మగుటలేదు. సర్వదేహశక్తులును, సర్వమనశ్శక్తులును గూడ నప్పుడొక్క కన్నులయందుమాత్రమే యేకీభవించియుండెను. అందఱు నేకాగ్రదృష్టితో మహారాజును, మహాత్ముఁ డగు నుపగుప్తునిజూచుచుండిరి. అప్పు డశోకుఁ డుపగుప్తున కెదురుగ లేచి నిలువఁబడి వినయవచనములతోఁ బూర్వోక్తభిక్షువ్యాపారముం గూర్చి చెప్పి ‘‘ఈవిషయమున నేనెంతవఱకపరాధిని?’’ అని ప్రశ్నించెను. ధర్మాచార్యుఁ డాద్యోపాంతముగ నెల్లసంగతులను విని యించుక సేపాలోచిం

చి ".మహారాజా! నీవుధర్మప్రాణుఁడవు. ధర్మవిజయమును
సాధించుటయే నీయుద్దేశము.ధర్మరక్షణమే ప్రజారక్షణము;
రాజ్యరక్షణము ధార్మికసంఘరక్షణము. ధర్మము ధార్మికులను
గాపాడును. నీయుద్దేశము మహోత్తరమైనది. సాధుసమ్మతమైన
ది. దేవతలు మానవులయభిప్రాయములను నుద్దేశములను గ్ర
హించి వారివారికర్మములంగూర్చి విచారణ చేయుచుందురు.
నీవిషయమునఁగూడ నీసనాతననీతియే యుపయోగింపఁబడఁ
గలదు. బాగుగ నాలోచించిచూడఁగా నీదుఃఖకరహత్యా
సంబంధమున నీవు సంపూర్ణముగ నిరపరాధివి." అనియెను.

మహారాజగు నశోకుఁడిప్పటికి శాంతచిత్తుఁడయ్యెను.
అప్పు డాతఁడు ధర్మాచార్యులకును సభ్యులకును వందనము లా
చరించి మరలఁ దనపీఠము నలంకరించెను.ధీమంతులును,ప్రా
జ్ఞులు నగుభిక్షు లందఱు నుపగుప్తుని ధర్మోద్దేశమునకు సంతు
ష్టచిత్తులైరి. ప్రియదర్శనుఁ డగు నశోకుఁడు మేఘముక్తసు
ధాకరునివలె నధికతరప్రియదర్శనుఁడై ప్రకాశించెను.

## ఇరువదియవప్రకరణము.

### సంస్కరణసభ.

మహారాజుహృదయమును గ్రహించినతోడనే భిక్షు
మండలికిఁ గల సకలసందేహములును వదలిపోయినవి. అనం
తరము వారందఱును నశోకునియుద్దేశముంగూర్చి సంతుష్టు

లైరి. విశ్వాసముగల నిష్ఠావంతులగు బౌద్ధులు స్వార్థపరులైన కపటవేషధారులను దమబౌద్ధసమాజము నుండి తొలఁగించివే యుటకు బద్ధకంకణులైరి. కపటాత్ముల దురుక్తులచే గర్హితంబులగు దురాచారములను రూపుమాపుటకు వారందఱును బ్రయత్నింపసాగిరి. భగవానుఁడగు బుద్ధదేవుని సదుపదేశము లన్నియు నేవిధముగ లోకమున సర్వోత్తమస్థానము నలంకరించునో యావిషయముం గూర్చి బౌద్ధధర్మాసక్తులగు వారెల్లరు నాలోచింపసాగిరి. సార్వభౌముఁడగు నశోకుఁడు పూర్వమునుండియు నిందులకే ప్రయత్నించుచుండెను. ఇప్పుడు సామాన్యముగనే ధర్మప్రచారమును సంస్కరణమును జేయవచ్చునని తెలిసికొనియెను. కపటాత్ములబోధనముల వలన దురాచారులగు బౌద్ధులంగాంచి విరక్తుఁడై తన యాచార్యత్వమును ద్యజించి మధురానగరమునకుఁ బోయియుండిన మహాత్ముఁడగు నుపగుప్తుఁడు మరల నిప్పుడు పాటలీపుత్రనగరమునకు వచ్చియుండెను.

బౌద్ధధర్మమునకును, సంఘమునకును వర్ధిల్లుట కనుకూలదినములు వచ్చినవి. ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తులు మూఁడు నొక్కచో సమ్మిళితములై యుండెను. అశోకమహారాజాతని సందేశము నుపగుప్తునకు నివేదించెను. నైష్ఠికులును, ధర్మోపజీవనులు నగు భిక్షులు తమతమయభిప్రాయములను ధర్మాచార్యునకు విశదీకరించిరి. అందఱియభిప్రాయములను బట్టియు నాలోచింపఁగా మతపరివర్ధనమున కొకసంస్కరణ

సభ యేర్పఱుపవలయు నని నిశ్చయింపఁబడియెను. ఇచ్ఛయు, సామర్థ్యమును, నపాదానము నేకమైనప్పుడు కార్యానుష్ఠానమునకు విలంబము కలుగఁబోదు! పాటలీపుత్రనగరమున బౌద్ధధర్మసమాజసంస్కరణార్థమై యొక్క గొప్పసభ కూడెను. ధర్మాచార్యుఁడగునుపగుప్తుఁడు సభాధ్యక్షుఁడయ్యెను. నియమవంతులును, శాస్త్రజ్ఞులును, సుధీవరులు నార్యులు నగు వేయిమంది బౌద్ధభిక్షులతో నొకసమితి యేర్పఱుపఁబడియెను. కార్యనిర్వాహణవిషయమున నట్టిసమితికిం దొమ్మిదిమాసము లవధి యేర్పఱుపఁబడియెను.

ఈసభయందనేకదేశములకు బౌద్ధులు చేరియుండిరి. అశోకమహారాజుకూడ నీమహాసభాసభ్యుఁడైయుండెను. మతాధికారి యగు నుపగుప్తుఁడు మహారాజసమక్షమున సభాగణసమాంగితులగు బౌద్ధులనందఱను వారివారిధర్మమత విశ్వాసములంగూర్చి విచారణ చేయుచుండెను; వారు నడచుకొనవలసిన పద్ధతులనన్నిటిని వారికి బోధించుచుండెను. వారికార్యకలాపములు విస్పష్టముగఁ దెలిసికొనుచుండెను. ఈ విధముగఁ బరీక్షించుటవలన ననేకులగు కపటాత్ముల చరిత్రములు తెలియవచ్చుటచే ధర్మవిరుద్ధాచారానుష్ఠానముల సంగతులుకూడ విస్పష్టములు కాఁజొచ్చెను. సభాపరీక్షయం దెవ్వరు స్వార్థపరులును గపటాత్ములు నని నిశ్చయింపఁబడుదురో యట్టివారు బౌద్ధసంఘమునుండి రాజాజ్ఞచేఁ దరిమివేయఁబడుచుండిరి. ఈరీతిగా నాఱువేలమంది కపటవేషధారు

లు బౌద్ధసంఘమునుండి తొలఁగింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. పిమ్మట నాయుర్వాసభ దురాత్ములదురాచారములను రూపుమాపి భగవంతుఁడగు బుద్ధదేవునివిశుద్ధధర్మసూత్రములను లిపిబద్ధములుగఁ జేయఁగలిగెను. ఈపరిశుద్ధసభాసాహాయ్యమున బౌద్ధధర్మపవిత్రగ్రంథము (త్రిరత్న) వహ్నిసంతప్తమౌ బంగారువన్నెమువలె విశుద్ధమై మరల నందఱకును బరిగ్రాహ్యయోగ్యమయ్యెను.

అశోకసార్వభౌముని జీవితచరిత్రమునందును, బౌద్ధధర్మేతిహాసమునందును నీమహాసభావిషయము చిరస్మరణీయమైనది.

---

ఇరువదియొకటవప్రకరణము.

---

సద్గురువు

మౌర్యకులతిలకుఁడగునశోకసార్వభౌముఁడు పూర్వాపరధర్మాచార్యుఁడగునుపగుప్తునియెడల భక్తిశ్రద్ధలు గలవాఁడై యుండెను. ఇప్పుడు మతము, సంఘసంస్కరణము మొదలగువానియందాతనితోఁ గలసిబనిచేయుటచే నశోకుఁడు ధర్మాచార్యుఁడగు నుపగుప్తుని సద్గుణములకు ముగ్ధుఁడైపోయెను. ఆరాజశిష్యుని యుదారహృదయమును, నసాధారణగుణగణములను, నన్నిటికంటె నధికంబగు నాతనిధర్మైకచింతయు బాగుగఁ దెలిసికొని యుపగుప్తుఁడు కూడ నశోకునిసద్గుణ

ములకు ముగ్ధుఁడై పోయెను. తామిద్దరును గలిసియుండుట మిగుల భాగ్యమని యిరువురును దలంచుకొనుచుండిరి. పుణ్యనదీప్రవాహద్వయ మేకత్రమిళితమయ్యెను. ఇరువురి ప్రార్థనములును సఫలీకృతము లయ్యెను.

విశ్వజనప్రేమధారాద్వయము నొక్కచో మిళితమయ్యెను. అట్లు మిళితములైన యాధారావాహినులు రెండు ననంతసాగరసమ్మిళితము లయ్యెను. విశ్వహితప్రశాంత సాగరము వానియెదుట ననంతవిస్తృతమైయుండెను. మానవపశుపక్షికీటపతంగవృక్షలతాచేతనాచేతనములతో నిండియున్న యీ విశ్వమునకంతకును గల్యాణముకొఱకును, వికాసముకొఱకును సాహాయ్యముకొఱకును నాయనంతమంగళసాగరము విరాజమానమగుచుండెను. ఇప్పు డాయిరువురిహృదయములు నావైపునకే పోవుచుండెను. ఈదివ్యమార్గమునందలి ప్రథమపథికుఁడును, ప్రేమావతారుఁడును, భగవానుఁడు నగుబుద్ధదేవుని యడుగులజాడల ననుసరించి పోవుటచే నాగురుశిష్యుల యేకాంతోద్దేశమై యుండెను. బుద్ధదేవునిపాదరజముచే నేయేస్థలములు పుణ్యతీర్థములుగ బరిణమించినవో యాస్థానములను దర్శింపవలయు నని వారిరువురును బ్రథమమున నుద్యుక్తులైరి. చతుస్సముద్రముద్రితమును, హిమాచలశోభితంబును నగు భారతవర్షమునకంతకు నాతఁడు చక్రవర్తియై యుండెను. ఇప్పు డాతనియుద్దేశ మేమి? ధనపదార్థసంగ్రహము, మార్గసంస్కారము మొదలగువానివిషయమై

యాతఁడెవ్వరికిని నాజ్ఞాపించియుండలేదు. ఆతనిహృదయ మాపవిత్రమనోరథపరిపూర్ణమైయుండెను. కాని వ్రతాచరణ మునకుఁ బూర్వము నియమసాధనముం బోలె నాతఁడు పూర్వజన్మయుండగు నుపగుప్తాచార్యుని పరిబోధనములవలనఁ దీర్థయాత్రోద్యోగమునందుఁ దనమనఃప్రాణముల నేకీభవింపఁ జేసెను. అశోకమహారాజా! నీవేధన్యుఁడవు! నీయదృష్టమెంత ధన్యమైనది! నీగురుబల మెంతధన్యమైనది! ఉపగుప్తుఁ డుపదేశకుఁడై యుండఁగా నీవు పరమసౌభాగ్యసంపన్నుఁడ వైతి వనుటలో నేమి యాశ్చర్య మున్నది?

---

## ఇరువదిరెండవపరికరణము.

### పుణ్యపరిసంగము

ఏమహాపురుషుఁ డుపదేశకుఁడుగా లభించుటవలనఁ దాను ధన్యుఁడనైతి నని ధర్మశీలుఁడును, ప్రియదర్శనుఁడు నగు నశోకసార్వభౌముఁడు భావించుకొనుచుండెనో యాధర్మాచార్యుని పుణ్యకథాపరిసంగములంగూర్చి యాలోచించుకొని మనముకూడ ధన్యుల మగుదము—ఉపగుప్తుఁడు కాశీనివాసియు, సుగంధద్రవ్యవిక్రేతయు నగుగుప్తునితనయుఁడు. పదునేను సంవత్సరముల యీడుననే యాతనిమతాసక్తి యతిప్రబల మయ్యెను. ధర్మముకొఱకును, సద్గురులాభముకొఱకును నాతఁడు దేశదేశములఁ దిరిగి తిరిగి తుదకుఁ జపానకు

కము లంబులకలును లేకుండునో యట్టివాఁడు భక్తిమార్గము నవలంబించువాఁడుగా నుండుట కర్హుఁడు కాఁడు. ఏమయిననేమి! బౌద్ధాచార్యుఁడగు సంవాసుఁడా యుపగుప్తుని శిష్యునిగా గ్రహించి, "ఓ కుమారా! మనుష్యహృదయ మాకాశమువంటిది. ఈ యాకాశమున వివిధహృదయభావములనుండి చింతామేఘము లుత్పన్నము లగుచున్నవి. ఈ మేఘములు విశేషసమయములలోఁ గృష్ణవర్ణములై యుండును. మఱియు వీనిలో ననేకములు నిర్మలములును, ధవళములునై యుండును. నీవు కొంతకాలమువఱకు నిర్జనస్థలమున నివసించియుండుము. ఎదుట నొకయుదకకలశము నుంచుకొని నీలశ్వేతవర్ణంబులగు కొన్నిశిలాఖండములను సంగ్రహించి యుంచుము. నీహృదయాకాశమున నెప్పుడెట్టి రంగుగల చింతామేఘము మగపడునో యట్టిసమయమున నట్టిరంగుగల యొక శిలాఖండమును జలపూర్ణకలశమున నిక్షేపించుచుండుము. అనంతర ముదయమున నాజలమును దీసివైచి యందున్న శిలాఖండములను వర్ణానుసారముగ విభాగము చేసి చూచుచుండుము. ఇట్లు చేయుచుండుటవలన నేమిఫలము లభించునో యాసంగతి నాకు నిర్దిష్టదినమునం దెఱింగింపుము." అని యుపదేశించెను.

ఉపగుప్తుఁడు తన గురువాజ్ఞానుసారముగఁ బ్రవర్తింపఁ దొడంగెను. మొటమొదటఁ గొన్నిదినములవఱకు నీలశిలాఖండసంఖ్య యధికముగఁ గానవచ్చెను. అనంతరము క్రమక్రమముగ నా సంఖ్య తగ్గిపోవ నారంభించెను. తుదకున్న

యను శ్వేతోపాఖ్యానము లేయయ్యెను. యువకుని యానంద
మునకుఁ బరిమితి లేకపోయెను. అప్పు డుపగుప్తుఁడు సనవాసు
దర్శించి యెల్లన గతులను మనవిచేసెను. ఈయువకునకు
జిత్తశుద్ధి యయ్యెనని సనవాసుఁడు గ్రహించెను. అనంతర
ము సనవాసుఁ డాయుపగుప్తుని దన శిష్యునిగఁ జేసికొని య
థావిధిగ ధర్మోపదేశములఁ జేయుచుండెను. సావధానముగ
ననేకరహస్యధర్మముల నాతనికి బోధించెను. సర్వసిద్ధుల
నాతఁడు గ్రహించునట్లు చేసెను. ఉపగుప్తుఁ డచిరకాలము
నందే బౌద్ధులందఱిలోనను సిద్ధపురుషుఁడను ప్రతిష్ఠాలాభము
ను బొందెను. పూజాప్రశంసాపాత్రుఁడయ్యెను. కొంతకాల
మునకు సనవాసుఁడు పరమసిద్ధి నందుటచే నాతనిసింహాసన
మున నుపగుప్తుఁ డధికారియై బుద్ధధర్మప్రచారము చేయ నా
రంభించెను. ఈవిధముగ నాతఁడు చాలకాలము నానాస్థాన
ములయందు నానారీతుల బుద్ధధర్మప్రశాంతవచనములను ధ
ర్మాసక్తులగు స్త్రీపురుషుల కందఱికిని బోధింపసాగెను.

ఉపగుప్తునికీర్తి నలుదెసల వ్యాపించెను. ఆతనిపుణ్య
ప్రసన్నముఖమండలము పూర్ణిమాచంద్రునివలె లోకులకు
మనోమోహన మగుచుండెను. ఆతనిపవిత్రముఖోద్గత యగు
వాణి యమృతస్వరూపిణియై యుండెను. సంచారసమయ
మునం దాతని యశస్సౌరభ మాతనికంటె ముందుగనే ప్ర
యాణము చేయుచుండెను. అందువలన ముగ్ధులై యాతనియా
పూర్వపుణ్యమూర్తిని దర్శించుటకును, నాతనిపవిత్రోపదేశ

బడిపోయిన వాఁడా ప్రత్యాఖ్యానుల నొల్లులక్ష్యను చేయఁగలు
గునని మంచిసమయము బోధింపవలయు నని ధర్మాచార్యుఁ
డు నిరీక్షించుచుండెను. కొంతకాలము జరిగిపోయినది.

ఆయువతీమణి యానగరమునఁ దనసౌందర్యసంపత్తి
ని యథాపూర్వము గనే విక్రయించుచుండెను. ఒకప్పుడు ధ
నవంతుఁ డగు నొకయువకుఁడు రత్నాలంకారభూషితుఁడై
యానందమునఁ గాలక్షేపము చేయవలయునని యామెయిం
టికి వచ్చెను. అప్పుడా వేశ్య నియమితద్రవ్యమునకుఁ దృప్తి
నొందలేదు. అతని రత్నాలంకారములనుగూడ గ్రహింపవల
యునని యామె యాశ! పపప్రయోగముచే నాతనిఁ జంపి యా
పాపాత్మురా లాతని యొద్దనున్న సర్వస్వమును హరించివైచె
ను. ఆతని మృతదేహ మొకరహస్యస్థలమునఁ బూడ్పఁబడి
యెను. కాని పాపము దాఁగలేదు. ఆదుర్మార్గురాలు పట్టుబ
డియెను. అప్పటిశాసనానుసారముగా నామెయొక్క చెవు
లను గోయించి యరణ్యమధ్యమునం దామెను విడిచిపెట్టు
టకుఁ దీర్మానింపఁబడియెను. ఆవిధముగనే కఠినశిక్షయయ్యె
ను. ఆక్రూరరాక్షసి శరీరఘాతనచేతను, క్షుద్బాధచేతను,
పిపాసాపీడచేతను నల్లాడుచు నాయరణ్యమునంబడి వికృత
నాదముతో నేడ్చుచుండెను. ఆసమయమున ధర్మాచార్యుఁ
డగు నుపగుప్తుఁడా యరణ్యమార్గమున బయలుశేరి యెచ్చటి
కోపోవుచు నావికటార్తనాదము నాలకించి యాదురాత్మ
రాలిచెంతకు వచ్చెను. అప్పుడా పాపాత్మురా లాయుపగుప్తు

ఆర్త పీడపెట్టబడిన,

విజనారణ్యమున నర్ధరాత్రమున మేఘాంధకారమధ్యమున క్షణప్రభ యగువిద్యుత్ప్రకాశముచేతనే విహ్వలచిత్తులగు పథికులు తమమార్గమును గనుఁగొనఁగలుగుచున్నారు. మందభాగ్యురాలగు నాయువతి యదృష్టము కూడ నీవిధముగా ఘటిల్లినది. ఆమూఢురాలు సుఖసౌందర్యైశ్వర్యపరిభవలలో నెట్టిగతికిఁ బోవలయునో యింతకాలమువఱకును గనుఁగొనఁజాలకపోయెను. కాని యిప్పుడామె తనజీవితదుర్దినమున ఘనాంధకారమున మహాత్ముఁడగు నుపగుప్తుని యుపదేశదీపకాంతిచే నాత్మైకశుద్ధమార్గమును గ్రహింపఁగలిగెను. ఆనిర్భాగ్యురాలిఁక నామార్గమును విడువలేదు. అప్పటినుండియు నామె ధర్మపథమును బట్టి పోయి తుదకమృతసదనమును జేరుకొనఁగలిగెను. ధర్మమునకును ధార్మికులకును గల మహిమ యిట్టిదియే.

---

## ఇరువదిమూఁడవపరిచ్ఛేదము.

### పుణ్యస్మృతి

బౌద్ధధర్మమందిరమున గాలివానయడఁగినతరువాత మహారాజగు నశోకుఁడు బౌద్ధక్షేత్రముల నన్నింటిని దర్శింపవలయు నని యుత్సాహము కలవాఁడయ్యెను. భగవానుఁడగుబుద్ధదేవునిపాదరజోలేశముచే నేస్థలములు పవిత్రములైనవో, శ్రీమంతుఁడగునాతనిచితాభస్మమే త్రిలోకపవి

త్రిమైనదని యేపుణ్యతీర్థములయందు భావింపఁబడుచుండెనో యాసర్వతీర్థములనుగూడ దానుస్వయముగఁ బోయి దర్శింపవలయు నని యాతఁడు వేడుకపడుచుండెను. ఆపావనక్షేత్రములయందుఁ దానొనరించుధర్మసంస్థాపనములపుణ్యస్మృతి చిరకాలమువఱకు జాగరిత మగుచుండవలయునని యాతఁడిచ్ఛయించుచుండెను. ఇంతవఱకనేక కారణములచే నాతనికోరిక నెఱవేఱినదికాదు. ఇప్పుడు శుభసమయము తటస్థించినది. ఇఁక నాలస్యము చేయరాదని మహారాజు నిశ్చయించుకొనియెను.

బౌద్ధేతిహాసవిదుండును, బహుశ్రుతుండును, ధర్మాచార్యుండు నగునుపగుప్తుఁడు మహారాజునకుఁ బవిత్రక్షేత్రముల ప్రాచీనచరిత్రలను బోధించి యుండెను. ఉపగుప్తుఁ డాపుణ్యక్షేత్రముల నన్నిటిని స్వయముగ నిదివఱకే చూచి యుండెను. అందుచేతనే యాతఁ డామహారాజునకు సకల పుణ్యక్షేత్రమహిమలను యథార్థముగ మనోహరముగ బోధింపఁగలిగెను. మహాత్ముఁడగు నుపగుప్తుని స్వభావవర్ణనావళమున నాపుణ్యక్షేత్రములన్నియు నామహారాజునకు మనోనయనగోచరములై యుండెను. అప్పుడు మహారాజు తీర్థయాత్రను సంపూర్ణప్రయత్నుఁడయ్యెను.

నిర్దిష్టశుభదినమున మహారాజగు నశోకుఁడును మహాత్ముఁడగు నుపగుప్తుఁడును దీర్ఘయాత్రకు బయలువెడలిరి. పాటలీపుత్రపరిసరవాహినియగుభాగీరథిం దాఁటి వారిరు

పురను వైశాలీనగరమునకుఁ బ్రయాణముచేసిరి. ఆవైశాలీనగరము పాటలీపుత్రమునకు ఈశాన్యమున ముప్పదిమైళ్ళదూరమునం దుండెను. బౌద్ధేతిహాసమునందు వైశాలీనగరము సుప్రసిద్ధమైనది. ఒకసమయమునందు బుద్ధదేవుఁ డీనగరమును దర్శించి మిగులఁ బ్రశంసించి యుండెను. జైనమతగురుం డగుతీర్థంకరమహావీరస్వామి జన్మభూమియగు గ్రామా గ్రామము వైశాలీనగరమునకు సమీపముననే యుండెను. సుప్రసిద్ధమగుమహావనవిహారము దానిసమీపముననే యుండెను. ఆవిహారమునందు బుద్ధదేవుఁ డనేకపర్యాయములు తనశిష్యులకు శాంతిమతధర్మోపదేశములను బ్రసాదించి యున్నాఁడు. అశోకమహారాజు, మహాత్ముఁడగు ఉపగుప్తుఁడును దానగరమునందుఁ బ్రవేశించి పరమానందము నొందిరి. అచ్చటి ప్రత్యేకదృశ్యములు వారిపుణ్యస్మృతులను బ్రగాఢముగఁ జేసివైచెను. అచ్చటిప్రజలు మహారాజగు నజాతశత్రునిఁ దిరస్కరించి స్వరాజ్యప్రతిష్ఠాపనముఁ జేసికొని యుండిరి. ఆస్థానమునందు ముఖ్యదండనాయకు లేకీభవించి యనుకూలబంధనములతో రాజకార్యనిర్వహణము చేయుచుండిరి. వైశాలీనగరమున బౌద్ధప్రాభవమప్పుడును నిరాఘాటముగ నెలకొని యుండెను. అచ్చటివాలుకారామవిహారస్థానమునందప్పుడు చాలమంది భిక్షులును, శ్రమణులును వాసము చేయుచుండిరి.

నశోకునియానతిచే నచ్చట నతిసుందరంబగునొకసింహస్తం
భము నిర్మింపఁబడెను.

(రామ గ్రామమునందలి పుణ్యస్మృతిస్థానముల నన్ని
టిని దర్శించినపిమ్మట వారు కాశీనగరమునఁ బ్రవేశించిరి.
ఆనగరము ప్రకృతిరామణీయకదర్శనస్థానములలో సుప్రసిద్ధ
మైనది. ఆనగరోపకంఠమునందలి సాలవనంబున శాంతిస్థాప
కుఁ డగు బుద్ధదేవుఁడు నిర్వాణలాభమును బొందియున్నాఁ
డు. భగవానుఁ డగు సిద్ధార్థుఁ డీస్థలముననే భిక్షుమండలి
కంతకు నంత్యోపదేశమును బ్రసాదించియుండెను. ఉపగుప్తుఁ
డశోకున కాచరిత్రమును స్మృతికిఁ దెచ్చి యానందింపఁ జేసె
ను. బుద్ధదేవుఁడు తనమృత్యుశయ్యయందు శయనించియుండి
కొలిచియున్న భిక్షుమండలిఁ గాంచి "ఓసాధులారా! సంయో
గవశముననే సకలపదార్థములు నుత్పన్నము లగుచున్నవి;
సంయోగవశమున నదయించుపదార్థము లన్నియు నశ్వర
శీలము లైనవే. ఈసత్యమును మీ రెల్లప్పుడును స్మరించుకొ
నుచు సర్వదా సావధానులై విధాయకకృత్యముల నేమరక
నెఱవేర్చుకొనుచుండుఁడు. ఇదియే నాకడపటియుపదేశము"
అని బోధించెను. ఈసంగతి యశోకునకుఁ జెప్పుచు నావిశా
లోన్నతసాలవనంబున బుద్ధదేవుని మహానిర్వాణలాభపుణ్య
స్థలంబున నిలువఁబడి యాసిద్ధార్థుని పవిత్రజీవితచరిత్రమును
గల్పనానయనములతో దర్శించుచు, వానిని మిగుల వర్ణించు
చు మహాభక్తుఁడగునుపగుప్తుఁడు భగవానునియమృతమయ

పరిశాంతోక్తుల నుచ్చారణ చేయ నారంభించెను. అప్పుడచ్చటనున్న వారందఱివదనములను నపూర్వభావావేశ మయ్యెను. మహారాజగు నశోకుని కుశీనగరతీర్థయాత్ర యీవిధముగ సఫలమయ్యెను. ఆతని మనఃప్రాణములు పుణ్యస్రోతమునఁ బవిత్రస్నానముం గావించెను.

ప్రియదర్శనుఁడగు నశోకుఁడు తన తీర్థదర్శనము చిరస్మరణీయమగునట్లు చేయనుద్దేశముతో నచ్చట నొక విశాలస్తూపమును నిర్మింపఁజేసి దాని సమీపమున నొక శిలాస్తంభముపై బుద్ధదేవుని పవిత్రనిర్వాణవృత్తాంతము నక్షరరూపమున వెలయింపఁజేసెను.

అచ్చటనుండి భిక్షుబృందములం బిలిచి విహారోద్యానమును జూచుటకు బయలుదేరెను. {ఆపవిత్రస్థానమున సిద్ధార్థుఁడు జన్మించెను} ప్రపంచమునంగల పుణ్యక్షేత్రము లన్నిటిలోను లుంబిని క్షేత్రము ముఖ్యమైనది} ఉపగుప్తుఁడు లలితవచనములతో భక్తిగద్గదస్వరమున బుద్ధదేవుని జన్మచరిత్రమును సవిస్తరముగ వర్ణించి చెప్పెను. స్థానమాహాత్మ్యము, ప్రసంగపవిత్రత, శ్రోతలయాదరభావము, వక్తయోగ్యత, భాషాలాలిత్యము సర్వము నేకీభవించుటచే నాదివ్యక్షేత్ర మపూర్వశోభావిలసితమై కానవచ్చెను. నయనశ్రవణహృదయంబులకు సమ్మేళనానుభవం బయ్యెను. తీర్థయాత్రికు లందఱును దాము ధన్యులమైతిమని భావించుకొనిరి.

అశోక మహారాజాదివ్యసలమును జిరస్మరణీయముగఁ జేయవలయు ననుద్దేశముతో నచ్చట నత్యున్నతంబగు శిలాస్తంభమును నిర్మింపఁజేసెను. ఆశిలాస్తంభమునం దీక్రింది వాక్యములను జెక్కింపఁజేసెను.

"దేవతాగణప్రియదర్శనుఁడగు నశోకమహారాజు తీర్థయాత్రలు చేయుచు నిచ్చటికి వచ్చి యీశిలాస్తంభమును నిర్మింపఁజేసెను. ఈదివ్యక్షేత్రము భగవానుఁడగు బుద్ధదేవుని జన్మస్థానము."

ఈపుణ్యస్థలమాహాత్మ్యమును స్మరించుకొనుచు నాక్షేత్రగౌరవమును వృద్ధిచేయునుద్దేశముతో బోధిసత్త్వపావననామముపై నాలుంబినీక్షేత్రమును నిత్యగమముగఁ జేసివైచెను. పిమ్మట నందఱును గలసి (1) కపిలవస్తునగరమువైపునకుఁ బ్రయాణముచేసిరి. (శాక్యరాజుల రాజధానీగౌరవచరిత్రమున నాలోకప్రసిద్ధంబగు నగరసుఖసమృద్ధుల విశేషముంగూర్చి వారు వినియుండిరి. కాని యీనగరమునకు సౌభాగ్యమును వారు దర్శింపలేదు. సిద్ధార్థునిసన్యాసగ్రహణానంతరమున రాజనగరసౌభాగ్యము మ్లానమయి యుండెను. తరువాత రెండువందలసంవత్సరములలోఁ గాలతరంగాఘాతముచే నానగరసౌందర్యము వినష్టమైపోయినది. ప్రతిస్థలమునను బూర్వస్మృతిని గలిగించు నిటుకలును, శిలాఖండములును మాత్రము నిలిచియున్నవి. ఒక్కొకచోటఁ బ్రశస్తశిలాఖండములపైఁ జెక్కింపఁబడిన సిద్ధార్థుని తల్లిదండ్రుల ప్రతిమూర్తులు

కపిలవస్తునగరమును దర్శించుటచే వారికి ధనజనసు ఖైశ్వర్యములయస్థిరత్వముంగూర్చి బాగుగ బోధపడియెను. ఆయనుభావముతోడనే వారు భగవానుడగుసిద్ధార్థునివైరాగ్యముంగూర్చి స్మరింపదొడంగిరి. రూపము, యౌవనము స్వాస్థ్యము, సుఖము, మహాభాగ్యము మొదలగు సర్వభోగోపకరణములును కరగతములై యుండినను మహాత్ముడగు బుద్ధదేవుడు వానినన్నిటిని గూడ నశాశ్వతపదార్థములని గ్రహించి స్వేచ్ఛగ త్యజించివైచి జగత్కల్యాణముకొఱ కాత్మసమర్పణముం గావించి యుండెను. ఆబుద్ధదేవునిమహానుభావ మెంతటియలోకసామాన్యమైనదియో యాసంగతి ధర్మప్రాణులగు నశోకోపగుప్తులు కపిలవస్తునగరమును దర్శించి సంపూర్ణముగ గ్రహియింపఁగలిగిరి.

పిమ్మటవారు కపిలవస్తునగరమును విడిచి క్రమముగాఁ గోణకమున్యాశ్రమం బగులుంబినీనగరమును దర్శించిరి. అనంతరము వారచ్చటనుండిపోయి యథాకాలమున శ్రావస్తీనగరమునఁ బ్రవేశించిరి. బౌద్ధభారతమున శ్రావస్తినగరము వాణిజ్యము, ధనము, భాగ్యము, సుఖసమృద్ధి మొదలగువానియందుఁ బాటలీపుత్రమునకుఁ దీసిపోవునది కాదు. వాణిజ్యప్రయోగమునకై బౌద్ధభారతప్రధాననగరములకు శ్రావస్తీనగరమునుండిసుగమంబులగురాజమార్గములువిశేషించియుండెను. అంతియకాదు. శ్రావస్తిబౌద్ధగణమునకొక ప్రధానక్షేత్రముగా నుండెను. భగవానుడగుబుద్ధుఁడుతన

జీవితమునందలి చాలకాల మీక్షేత్రమునందే గడపియు
న్నాఁడు. బుద్ధదేవుఁడును, బౌద్ధభిక్షులును నివసించుటకును,
ధర్మప్రచారోపయోగమునకొఱకును, దానవీరుఁడును, భక్త
శ్రేష్ఠుఁడు నగు సుదత్తుఁడను వర్తకప్రముఖుఁడు నీజేతవనమును
బౌద్ధసంఘమునకు సమర్పించియుండెను. ఆజేతవన మతిరమణీయ
మైనది. సుదత్తుఁడీ రమణీయోద్యానమును జేతుఁడను
యువరాజునొద్దఁ బదునెనిమిదికోట్ల సువర్ణములకుఁ గొని
యుండెను.

కాని యాయువరాజు సుదత్తుని ధనమును స్వయముగ స్వీకరించియుండలేదు. ఆతఁడాధనముతో జేతవనమునందు బుద్ధదేవునకును, నాతనిశిష్యులకును సుఖోపయోగముకొఱకును, ధర్మప్రచారమునకు సాహాయ్యముకొఱకును వలయు నేర్పాటులను గావించెను. ఆజేతవనమునందు భక్తుఁడగు సుదత్తుఁడును, మహాసుభద్ర, కుంతీసుభద్ర, యను నాతనితనయలును భగవానుఁడగు బుద్ధదేవుని సశిష్యముగ సేవించి ధన్యులైరి. బౌద్ధేతిహాసమున శ్రావస్తీనగరస్మృతి వైభవము చేనేమి, వైరాగ్యముచేనేమి, భోగముచేనేమి, త్యాగముచేనేమి యనేకవిధములఁ బ్రకాశిత మగుచుండెను. ధర్మాచార్యుండును బురాణజ్ఞుండు నగు నుపగుప్తుఁడా సమస్తవృత్తాంతమును మహారాజునకు నాతనియనుచరులకు నామూలాగ్రముగ వినిపించెను. బుద్ధదేవుని యపూర్వమహిమాన్వితచరిత్రమును, శ్రేష్ఠియగు సుదత్తుఁడు, యువరాజగు జేతుఁడును గావిం

చిన మహత్తరత్యాగచరిత్రమును విని యందఱును శ్రద్ధావనతులైరి. సార్వభౌముండగు నశోకుండా స్థలములఁ గూడ శ్రద్ధాపూర్వముగ ననేకస్తూపములను, స్తంభములను నిర్మింపఁ జేసి యటనుండి శ్రీగయాక్షేత్రమునకుఁ బ్రయాణమయ్యెను.

మహారాజు గయయందలి నిరంజనతీరమునందున్న యురువిల్వగ్రామమును, బోధివృక్షమును గూడ దర్శించెను. ఉపగుప్తుఁడు సిద్ధార్థుని యసాధారణాభ్యాసముం గూర్చియు నాతని బుద్ధత్వలాభమును గూర్చియు లలితవచనములతో మహారాజునకు బోధించెను. ఆపుణ్యస్థానదర్శనమును, నచ్చటి, వారిపుణ్యచరిత్రశ్రవణమును గావించి మగధేశ్వరుండగు నశోకుండు వారణాసీనగరమును గూర్చి ప్రయాణము చేసెను. మహాత్ముఁడగు బుద్ధదేవుఁ డొకప్పు డుపకాముఁడను తత్వజ్ఞునితో నీకాశీపురమును గూర్చి యిట్లు చెప్పెను. "నేను కాశికిఁ బోఁగలను. కాశికిఁ బోయి యచ్చట నప్రతిహతంబగు ధర్మసంస్థాపనమును జేయఁగలను" అని—

ఆదిన మొకటి; ఈదినము మఱియొకటి. ఆదినమున బుద్ధదేవుఁడు చెప్పిన "పోఁగలను" అను భవిష్యత్కాలమింక లేదు. ఇప్పుడాతని కాశీక్షేత్రాగమనము ధర్మచక్రపరివర్తనమున నిదివఱకే పరిణతమైపోయినది. ఇఁక నచ్చట నాపుణ్యస్మృతిమాత్రమే జాగరిత మగుచున్నది. భగవానుఁడగు సిద్ధార్థుని పవిత్రపదరజోలేశముచే బావనమైన యాకాశీక్షేత్రమును దర్శించు నభిలాషతో నచ్చటివారిపుణ్యచ

రిత్రములను వినవలయునను కోరికతో భక్తులు విచ్చేసి యుండిరి. రాజర్షి యగునశోకుఁడును ధర్మాచార్యుఁడగునుప గుప్తుడును రాజానుచరులును గాశికానగరమును దర్శించిరి. సమీపమునందున్న సారానాథమును దర్శించి కృతార్థులమైతి మనుకొనిరి.

అశోకసార్వభౌముని దూరతీర్థయాత్ర సంపూర్ణమయ్యెను. అంతటవారు కాశికానగరవాసినియగు గంగానదియందలి నౌకనారోహించి యథాసమయమునకుఁ బాటలీపుత్రమునకు వచ్చి చేరిరి. వారితీర్థప్రవాసము సంపూర్ణమయ్యెను.

---

## ఇరువదినాలుగవప్రకరణము.

---

### పుణ్యప్రభావము.

తీర్థయాత్రకుఁ బోయి వచ్చినతరువాత నశోకునిచరిత్రమునందును, నాతనియాచారవ్యవహారాదికార్యములయందును విశిష్టపరిణామమగపడుచుండెను. తీర్థయాత్రాసమయమునం గలిగిన పుణ్యప్రసంగశ్రవణమాహాత్మ్యమును, పవిత్రవిషయాలోచనముచే లభియించిన పుణ్యప్రభావమును గూడ నాతనిప్రతికార్యమునందును బింబితమగుచుండెను. నానాదేశములను దర్శించి నానాశ్రేణులయందలి నానాజాతిజనులతోఁ గలిసికొనుటవలనం గలిగిన ప్రత్యక్షప్రథమఫల

మేమన—అందువలన నాతనిహృదయ మనస్సాంకర్యమంతయు దూరమైపోయెను. త్యాగశీలుఁ డగు నశోకునిహృదయము మఱింత యుదార మాయెను. ఇట్టిసత్సంగమువలనను, పవిత్రక్షేత్రసందర్శనమువలనను, సాధుసజ్జన సంబంధమువలనను, నశోకునకు భూమండలముతోఁగూడఁ గుటుంబము వలెను వృద్ధి యయ్యెను. సాధుసజ్జనమండల మంతయు నాతని కుటుంబమయ్యెను. అశోకునకుఁ దీర్థయాత్రవలన నీసకల సత్ఫలములును సంపూర్ణముగ లభియించెను.

తీర్థయాత్రావశమున నాతఁడు తనరాజ్యమునందలి విశేషభాగములను దర్శించెను. ఎచ్చటఁ జెరువులను త్రవ్వింపవలయునో, యెచ్చట వంతెనలను గట్టింపవలయునో, యెచ్చటసుగమంబు లగు రాజమార్గముల నేర్పఱుపవలయునో యాతఁడు స్వయముగఁ జూచి యుండెను. ప్రజాసామాన్య మంతయు నెట్లుకాలక్షేపము చేయుచుండెనో ప్రజలకృషివాణిజ్యాదుల యవస్థ యెట్లుండెనో వారినిత్యనైమిత్తికక్రియాకలాపము లేవిధముగ నుండెనో యంతయు నాతఁడు స్వయముగఁ జూచి గ్రహింపఁగలిగెను. రాజధానికి దూరమునందున్న జనపదములయందలి బలవంతులయత్యాచారములు దుర్బలులదురవస్థలును నివారించువిషయమున రాజోద్యోగులందఱు నెట్లు మనఃపూర్వకముగఁ బనిచేయుచుండిరో యా సంగతికూడ నాతనికి స్పష్టముగ బోధపడియెను.

ప్రజావత్సలుఁడును, ధర్మపాలుఁడును, సహృదయుఁడు నగు నశోక మహారాజు స్వయముగ దేశమునందలి స్థితిగతు లన్నిటిని దెలిసికొని ప్రజాసుఖవర్ధనముకొఱకును, దుఃఖనివారణముకొఱకును గావలసిన నుపాయము లన్నిటి నిగావించెను. సామాన్యజనులందఱును ధర్మకర్మములు, సత్కార్యములు మొదలగువానిఁ బవిత్రముగ జీవయాత్ర నడపుకొనునట్లు వారివారి కనుకూలముగ నుండునట్టి యుపయుక్తకార్యములనుగూడ నశోక మహారాజు స్వయముగఁ దెలిసికొని సంపూర్ణముగఁ గావించివైచెను. ఈసకలసత్కార్యములవలననే లోకమునం దాతనికి ధర్మాశోకుఁడని విశేషవిఖ్యాతి లభియించెను. ధర్మాశోకుని చరిత్రాంతరాళమున శ్రీబుద్ధదేవుని శాంతిమతధర్మపవిత్రాదర్శోపదేశములును, సార్వభౌముఁడగు నాతని సకలపుణ్యక్షేత్రసందర్శనమును, మహాత్ముఁడగు నుపగుప్తుని సత్సంగమువలనం గలిగిన పుణ్యప్రభావమును సుప్రసిద్ధములై విస్పష్టముగ విరాజిల్లుచుండెను.

---

## ఇరువదియైదవప్రకరణము.

---

### అశోకసామ్రాజ్యము.

సౌభాగ్యమయ మగు భూఖండమున మహాభాగుఁడగు నశోకసార్వభౌముని పుణ్యప్రభావ మెంతటియౌన్నత్యమును వహించియుండెనో యెంతదూరమువఱకు వ్యాపిం

చియుండెనో యాసంగతి యావశ్యకముగఁ దెలిసికొనవలసి యున్నది. మౌర్యప్రభుం డగు చంద్రగుప్తుఁడు భారతసామ్రాజ్యమునకుఁ జక్రవర్తియై యుండెను. ఆతని పుత్రుఁడు బిందుసారుఁడు. తండ్రి యనంతరమున బిందుసారుఁ డీవిశాల రాజ్యమునకుఁ బ్రభుఁ డయ్యెను. బిందుసారుని యనంతరమున నాతనికుమారుఁడగు నీయశోక సార్వభౌముఁ డఖిలరాజ్యభారమును వహించియుండెను. ఆతఁడు పితృపైతామహంబగు రాజ్యమంతయును గరగతము చేసికొనియుండెను. అంతియేకాక యిదివఱకుఁ దమపూర్వులకు లభియింపని కళింగరాజ్యమునుగూడ నశోకుఁడు స్వీయబాహుబలముచే సంపాదించియుండెను. ఏకారణముచేతనో యాకళింగ రాజ్యము నశోకుఁడు తనపరిపాలనమునం దుంచుకొనక పూర్వప్రభునకే దానినొసఁగి యాతనిఁ దనసామంతప్రభునిగాఁ జేసికొనియెను. అప్పటినుండియుఁ గళింగము సార్వభౌముఁడగు నశోకునకు సామంతరాజ్యములలో నొక్కటి యయ్యెను. కళింగమును జయించినతరువాత నాతఁడు తనపూర్వరాజ్యము నింకను వృద్ధిచేయవలయు నను రాజ్యకాంక్షను వదలి యుద్ధవిగ్రహములను విరమించివైచెను. ఒక్క ద్రవిడదేశమునందలి కొంతభాగముగాక భారతవర్షమంతయు నశోకునకు స్వారాజ్యమై యుండెను. ఇప్పటిదొరతనమువారి భారతసామ్రాజ్యముకంటె నశోకునిరాజ్యమే చాలఁ బెద్దదిగానుండెను. ఉత్తరమున గాంధారముమొదలు కాబూల్ స్థానమునుండిదక్షిణ

మునకవ్యాకుమారీపర్యంతమును, బశ్చిమమున సౌరాష్ట్రము మొదలు తూర్పునం దాగ్రవలి ప్రవజుకును నశోకసామ్రాజ్యము వ్యాపించియుండెను. ఇది యంతయు నాతనియధికారమునకు లోబడియున్న దేశమై యుండెను. కాని యీదేశము నావల నున్న దేశము లయందుంగూడ నాతనిపుణ్యపరిభావము వ్యాపించి యుండెను. ఉత్తరమున నేపాళము, టిబెట్టు; దక్షిణమున సింహళము, తూర్పున బ్రహ్మదేశము (బర్మా) వఱకుంగూడ నాతనిపుణ్యపరిభావము సుప్రసిద్ధమై యుండెను. (ప్రాగ్జ్యోతిషమండలమున (ఆసామ్పరిదేశము) బుద్ధమతపరిచార మేమియు నున్నటగపడదు. ఒక్కమాటలోం జెప్ప వలసినచో ఆసాము, బర్మాకాక తక్కినసాగరమేఖలాహిమాద్రిశోభితసమస్తసమగ్రభారతవర్షమును నశోకుని సామ్రాజ్యమే యైయుండెనని పరిగణింపవచ్చును. ఈవిశాలభూమండలమునం బల్లెలు మొదలు పట్టణములవఱకును, స్థలపథములయందును, జలపథములయందును సర్వప్రదేశములయందును జనోపయోగకరంబు లగు కార్యముల నెన్నిటినో సార్వభౌముం డగు నశోకుండు గావించియుండెను.

---

## ఇరువదియాఱవపరికరణము.

### దేశస్థితి.

అశోకుని పరిభుత్వమునందు మొదటం గొంతకాలము వఱకు దేశమునం దశాంతి కలిగెను. కళింగయుద్ధముకూడ

నట్టియశాంతికారణములలో ముఖ్యమయినదిగా నుండెను. కళింగవిజయానంతరమున నతనిప్రభుత్వములో ముఖ్యముగ నుల్లేఖింపవలసిన యాశాంతికారణము లేవియును లేవు.

రాజ్యాధికారముకొఱకు యుద్ధముచేయుట యావశ్యకము. కాని ప్రజాహృదయరాజ్యాధికారముకొఱకు మాత్రము శాంతిస్థాపనము ముఖ్యావశ్యక మయినది. ప్రజావత్సలుఁడగుధర్మాశోకుఁడీసత్యమును గ్రహించియుండెను. అందుచేతనే యాతఁడు మిగులఁబరిశ్రమచేసి తనవిశాలసామ్రాజ్యమున శాంతిస్థాపనమును గావించెను. దేశమునందంతటను శాంతి నెలకొనియుండుటచేఁ గృషివాణిజ్యాదులును శిల్పాదికళలునుగూడ నిరాఘాటముగ నున్నతిం బొందుట కవకాశము కలిగెను. అందువలనఁ బ్రజలుఁగూడ నౌన్నత్యము లభియించెను. అశోకుని రాజ్యకాలమున దేశమునందలి కృషి, వాణిజ్యము, శిల్పము, శిక్ష మొదలగువానియవస్థ యెట్లుండెనో ప్రత్యేకముగ సంక్షేపముగఁ జెప్పుచున్నాము.

కృషి:—చిరకాలమునుండి భారతవర్షము కృషిప్రధానమైనదేశము. ఆవిరియంత్రములు, విద్యుద్యంత్రములు, వాయుయంత్రములు నయోమార్గములు మొదలగునవి ప్రబలియున్న యిక్కాలమునందుఁగూడ నీదేశమునందు నూటికి డెబ్బదిమంది కృషిజీవను లున్నారు. ఇప్పటికిఁ జాలకాలమునకుఁ బూర్వమునం దీదేశమునఁ జాలమంది కృషిమీఁదనే యాధారపడి యుండిరని నిస్సంశయముగఁ జెప్పవచ్చును.

ప్రభువుల యాదాయమునందలి హానివృద్ధులు చాలవఱకీవ్య వసాయమునుబట్టియే యుండును. కావునఁ గేవలమును రాజు కృషికోపయోగకార్యములను జేయుటయందే జాగరూకుఁడై యుండవలయును. అశోకుఁడు తనరాజ్యమున వ్యవసాయమున కనుకూలముగానుండును, సస్యక్షేత్రములఁ దడుపుటకును వలసినన్ని కాలువలను ద్రవ్వించెను. అనేకస్థలములయందలి కొండవాగులనుగట్టించి నీరునిలవచేయించి యనుకూలోపయోగములను గావించెను. అదనుతప్పకుండఁ బొలములఁ దడుపుకొనుటకుఁగూడఁ దగినసదుపాయముల నేర్పఱచెను. ఈపనులన్నియు యథాక్రమముగ జరపుటకుఁ దగినయుద్యోగులు నియమింపఁబడి యుండిరి. వారిమూలమునఁ గృషికుల యొద్దనుండి యథోచితముగ నీటిపన్ను గ్రహింపఁబడుచుండెను. అప్పుడీనీటిపన్నున కుదకభాగమని పేరు. ఇప్పటికంటె నాకాలమునందే సస్యక్షేత్రములు మిగులవిరివిగ నుండెను. ఈలందిప్రయత్నములచేఁ గొంచెభూమిని కృషిచేయుటచే తనే కృషికులగృహములు సంపన్నములగుచుండెను. కృషి చేసినభూమి విరివిగనుండిన బంట సరిగాలేనప్పుడు పండిన పంటలో నాఱవపాలుమాత్రమే రాజునకుఁ బన్నుగఁ జెల్లింపవలసియుండుటవలనఁ గృషికులకును వారివారమునకును గావలసినంతయాదాయము లభియించుచునే యుండెను. అందువలన నతివృష్టి, యనావృష్టి మొదలగునీతిబాధలు తటస్థించినప్పుడుగూడఁ బ్రజలకుఁ దిండిలేక దేశములఁబట్టి పోవ

లసిన యవసరము లేకుండెను. అట్టివారి సంరక్షణముకొఱకు రాజు తనకోశమునుండి ధనమును వెచ్చింపవలసిన యావశ్యకమును లేకుండనుండెను. విశేషముగ ధనమున్నంతమాత్రమునఁ బ్రజలు సుఖులై యుందురనుట కవకాశము లేదు. ఒక్కొక్కప్పుడు ధనమిచ్చినను నాహారపదార్థములు లభింపకపోవచ్చును. కావునఁ బ్రతిగ్రామమునను సంవత్సరమునకుఁ జాలినన్ని యాహారపదార్థములు నిలువయుండునట్టి యేర్పాటు చేయవలసి యుండును. ధర్మప్రియుఁడును, దయామూర్తియు నగు నశోకసార్వభౌముని రాజ్యపాలనమునం దట్టిసర్వోపయోగకరంబగు నేర్పాటు చేయఁబడియుండెను. మనుష్యజీవనమునకు ముఖ్యముగఁ గావలసినవి మూఁడు; అన్నము, వస్త్రము, జలము. ఇవి యథోచితముగఁ బ్రజాసామాన్యమునకందఱకును లభియించునట్లు చేయుట రాజునకుఁ బ్రధానకర్తవ్యము. ధర్మాశోకుని రాజ్యకాలమునం దీపద్ధతి యథావిధిగఁ బరిపాలించి నట్లాతని పవిత్రచరిత్రమునందు విస్పష్టముగఁ దెలియవచ్చుచున్నది.

వాణిజ్యము:—అప్పటి ప్రజల సుఖము, సౌకర్యము, అభిరుచి మొదలగువాని ననుసరించి యావశ్యకములగు మార్గములు ఘట్టములు, యానవాహనాదికములును సురక్షితముగ నెలకొల్పఁబడియుండెను. ఆకాలమున స్థలమార్గములును, జలమార్గములునుగూడ జనుల రాకపోకలకుఁ జాలననుకూలములుగ నుండెను. కాని యాకాలమున సస్యములు, దారుపదార్థ

ములు మొదలగు భారపదార్థము లొకదేశమునుండి మఱి యొకదేశమునకుఁ దీసికొనిపోవుటవలన లాభము లేకయుండెను. ఇక్కాలమున బార్లిసాలు; బియ్యము, సముద్రవనదారువులు, రాణిగంజినేలబొగ్గు, బర్మాకిరోసెనునూనె మొదలగునవి దేశదేశాంతరములకుఁ బోవుటవలన లాభము లభియించుచున్నది. ఆకాలమున నట్టిపద్ధతి లేదు. అప్పటివర్తకులు స్వదేశవర్తకమునందేమి, విదేశవర్తకమునందేమి యట్టివస్తువుల నుపయోగించెడివారు గారు. అప్పటివారు పట్టుబట్టలు, మజ్లినులు, అస్త్రశస్త్రములు, సూచీవిచిత్రితములగుజిలుగువలువలు, సుగంధద్రవ్యములు, కస్తూరి, శిలాజిత్తుగజదంతములు, గజదంతనిర్మితములగు విచిత్రవస్తువులు, రత్నాభరణములు, వెండి, బంగారము, మొదలగువస్తువులతో దేశవిదేశవర్తకమును జేయుచుండెడివారు. వర్తకు లిట్టిలఘుభారవస్తువులను దీసికొని దేశాంతరములకుఁ బోయివర్తకము చేయుటవలన వారికి మిగులనుపాయముగ నుండెను. ప్రయాణమునఁ గష్టముండెడిది కాదు. ఆవర్తకులు తఱచుగ గుంపులుగుంపులుగఁ బ్రయాణము చేయుచుండిరి. వారు సుప్రశస్త రాజమార్గమును వదలి పల్లెలకుఁ బోవలసి యున్నప్పుడు గ్రామస్థులు వారిని దమయూరికిఁ దీసికొనిపోయి నిరపాయస్థలముల నివసింపఁ జేయుచుండిరి. నిర్జనపథంబుల దూరముగఁ బోవలసినప్పుడును, రాత్రికాలమునఁ బ్రయాణముచేయవలసినప్పుడును రాజభటులు వారికిరక్షకులై యొకచోటినుండి

మఱియొకచోటికిఁ బంపుచుండిరి. ఇట్టిసదుపాయములకొఱకు వర్తకులకు శుల్కము విధింపఁబడియెను. ఈవిధముగా వర్తకులను నిర్జనపదములయందును, నెడారులయందును, దుర్గమస్థానములయందును, రాత్రికాలములయందును, చోరాదిబాధలనుండి రక్షించుటకొఱకుఁ దగినంతమందిరక్షకభటులునియమింపఁబడి యుండిరి. అశోకరాజ్యమునందంతటను వర్తకులకిట్టి యనేకవిధము లగుసౌకర్యము లుండెను. విదేశవర్తకముకొఱకు జలమార్గములయందుఁగూడ నట్టిసౌకర్యము లుండెను. వర్తకుల వర్తకవస్తువులవెలల ననుసరించి సుంకములు నిర్ణయింపఁబడుచుండెను. ఈకార్యములన్నియు విశ్వాసముగల సమర్థుఁడగునుద్యోగివలన నెఱవేర్పఁబడుచుండెను. వర్తమానకాలమున రేవులయందును నితరస్థలములయందును వర్తకపుసరకులపై విధింపఁబడుచుండుసుంకము పూర్వకాలమునకంటె నధికముగా నున్నది. రాజ్యాభ్యుదయమున కిది యొకప్రధానోపాయముగా నుండెను. కాని యాకాలమున వ్యవసాయమును వాణిజ్యమును నింతవిస్తారముగ లేకపోయినను మహారాజగు నశోకుఁడు వ్యవసాయవర్తకములకొఱకుఁ జేసినసదుపాయములంగూర్చి యింతకాలమునకుఁ దరువాత వినినప్పుడు ప్రేమమూర్తి యగునశోకుని యుదారహృదయముంగూర్చి యెల్లరు నేకగ్రీవముగఁ బ్రశంసింపవలసి యున్నది.

శిల్పము:—అశోకుని రాజ్యకాలమున భారతవర్షము నందంతటను శిల్పవిషయమున విశేషాదరము కలదు. మౌర్యకులతిలకుండగు నశోకుని రాజధానిని, రాజప్రాసాదభగ్నావశేషములను జూచి చీనాదేశపరివ్రాజకుండగు ఫాహియాను తనమనంబున నీనగరమును, నీరాజప్రాసాదమును మానవనిర్మితములే యగునా యని యాశ్చర్యపడియెను. కోటగోడలమీంది చంద్రశిలాఫలకములపైనాకాలపుజనులదైనికజీవనోత్సవములను, యాత్రాస్థలవిశేషములనుగూర్చిన చిత్రములను జూచి ఫాహియాను ముగ్ధుడైపోయెను. రాజసభామంటపమునందలి దారుస్తంభములపై స్వర్ణరౌప్యరసరంజితంబులగు దృశ్యములంగాంచి తన్మాహాత్మ్యమును వర్ణింపజాలకపోయెను. శిల్పమునకుం జీనాదేశము సుప్రసిద్ధమైనది. అట్టిచీనాదేశమునందలి సుప్రసిద్ధశిల్పరచనానిపుణుండగు ఫాహియానుని యటివాం డశోకునికాలమునందలి శిల్పములంగాంచి యింతవింతపడుటం జూడంగా నప్పటిమనవారిశిల్పరచనాప్రావీణ్య మెంతియధికముగా నుండెడిదో బోధపడంగలదు. అశోకుండు తనరాజ్యకాలమునందు రాజధానియందనేకస్థలముల యందు స్తూపములను స్తంభములను విశేషముగ స్థాపించియుండెను. వానిసంఖ్య యెనుబదినాలుగువేలు. కాలసముద్రతరంగములలో నవియున్నియు నిప్పుడేమి భగ్నములైపోయినవి! కాని యిప్పటికిని భారతవర్షమునవివిధస్థలముల యందాస్తూపస్తంభభగ్నావశేషములు జలమగ్నంబు లగు

నౌకావశేషములవలె నగపడుచునే యున్నవి. భూపాలము నొద్దనున్న సాంచిస్తూపమును, గాశియొద్ద నన్నసారానాథ స్తూపమును వీనిలో ముఖ్యములైనవి. అశోకుని కాలమున శాస్త్రశిల్పరచనలు విశేషముగ నుండెడివి. పర్వతములపైఁ జెక్కఁబడినవియు, వివిధస్థలములయం దగపడు శిలాఖండముల పైఁ జెక్కఁబడినవియు నగుశిల్పమూర్తులంజూచినచో నాకాలమున విశేషముగనున్న వివిధశిల్పరచనావిశేషములు బోధపడఁగలవు. అప్పటియువతిమణు లెట్టి యలంకారములను ధరియించుచుండిరో వానినిబట్టి స్పష్టముగఁ దెలిసికొనవచ్చును. కంకణములు, కంఠహారములు, కర్ణపుష్పములు మొదలగు నలంకారము లప్పుడు విశేషముగ వాడుకలో నుండెను. చరిత్రమునం దశోకయుగమునుం గూర్చిన వర్ణనమును బఠించినప్పుడను నప్పటి చిత్రశిల్పములం బరీక్షించినప్పుడును నప్పటివారు విశేషవేషభూషణాలంకృతులై యున్నట్లు స్పష్టపడఁగలదు. భాగవతవర్ణితం బగు శ్రీకృష్ణుని మోహనపింఛమును, పీతాంబరధారణమును నప్పటిపురుషుల సమాదరాలంకారములై యుండెను. ధనికులు, పత్రికులు మొదలగు వారియుష్ణీషములయందు శ్రీకృష్ణుని చూడాలంకారమువలె నొకయపూర్వాలంకారము ఫణిఫణారూపమున విరాజిల్లుచుండెడిది. ధరించినపరిధానము నందనందనునిపీతాంబరమువలె వెలరారుచుండెడిది. ఆపీతాంబరమునకుఁ గ్రిందియంచులు మెఱయుచుండెడివి. అట్టివస్త్రములపై నపూర్వ

కాంచీధామము లలంకారములుగ నుండెడివి. ఇరువది ము
న్నదిసంవత్సరములకుఁ బూర్వమువఱకు బంగాళా బాలికలకట్టి
మండలముపై కట్టిచంద్రహారములును సూర్యహారములును
ధరియింపఁబడుచుండెను. అప్పటిపురుషులలో నిట్టియలంకార
రచన లుండెను. ఏఁబది సంవత్సరములకుఁబూర్వము బంగా
ళాదేశము నందలి నిమ్న జాతిపురుషులలోఁ దలపైఁ బక్షి ఱెక్క
లను గత్తిరించి జూలుగాఁ జేసి ధరియించునలవాటుండెడిది.
పురాతన కాలపువస్తువులను, నర్వాచీన కాలపువస్తువులకును
నేవిషయమునందైననింతక సాదృశ్యము గనఁబడుచున్నప్పుడు దా
నిం గూర్చి యించుక యాలోచించి విభేదకారణమును దెలిసికొ
ని నిర్ణయింపవలసియుండును. కావున నింతవఱకు వ్రాయ
వలసివచ్చినది. ఎట్లోయొక విధముగ నిప్పు డశోకునికాలము
నాఁటి ప్రజలవేషభూషణాదులం గూర్చి యించుక పరిచయముం
గలిగింపఁజాలితిమి. ఈస్వల్పపరిచయముంబట్టి యాలోచింపఁ
గా నప్పటినారియభిరుచులును, సౌందర్యాదులును బాగుగ
బోధపడఁగలవు. అశోకయుగమునఁ గట్టడపుఁబనులు, చె
క్కడపుఁబనులు, రత్నపుఁబనులు, చిత్రపుఁబనులు మొద
లగుశిల్పము లేకాక యింకను వివిధశిల్పములు విశేషించి యు
న్నట్లగపడుచున్నది. వీనిలో నేత, వస్త్రము, కమ్మరము,
కుండలుచేయుట మొదలగుపనులు ప్రధానములై యుండెను.
ఈపనివాండ్రు ధర్మాశోకరాజ్యమున వృత్తులననుభవించుచు
సుఖజీవనము చేయుచుండిరి. ఒక్కమాటలోఁ జెప్పవలె నన్న

చో నిట్టివారిచేఁ జేయఁబడు శిల్పము లన్నియు నభివృద్ధి నొం
దియున్నవనియు, జనసమాదరమునుం గాంచియున్నవనియుఁ జెప్ప
వలయును.

శిక్ష.—బ్రాహ్మణప్రధాన మగు భారతవర్షమున "వి
ద్యాశిక్షణము" అనుమాట యగ్రవర్ణోచితవిద్యాశిక్ష యని
యెల్లరకును మనస్సునకుఁ దట్టును; గురువు, శిష్యుఁడు, గురు
గృహము, బ్రహ్మచర్యము, గురుదక్షిణ మొదలగునవి య
న్నియు జ్ఞప్తికి వచ్చును. మే మిప్పు డేయుగమునుగూర్చి చె
ప్పుచుంటిమో యాకాలమున భారతవర్షమున బ్రాహ్మణప్ర
భావము లేనేలేదు. శిక్ష కేవల మగ్రవర్ణములవారి చేతుల
లోనే బంధింపఁబడి యుండలేదు. బౌద్ధమతమునందు జాతిభే
దము లేదు. జాతిభేదములేదని చెప్పినప్పుడు విద్యాశిక్ష సర్వ
జనములయందును వ్యాపించియుండెనని వేఱుగఁ జెప్పనక్క
ఱలేదు. మతముతోఁ గూడ విద్యాశిక్షణమునకు విశేషసంప
ర్కము గలిగియుండెను శాస్త్రాలోచనము, శాస్త్రశోధనము
ధర్మసంహిత మొదలగువానితో సంబంధముగ నెల్లవారి
కిని వ్రాయుటకును జదువుటకును వలయు ననుకూలోపపత్తు
లు కావలసియుండెను. సకలదేశములయందలి ప్రాచీనేతిహా
సములయందును నిదియే యగపడుచున్నది. బౌద్ధయుగమునం
దుఁగూడ నీవిద్యాశిక్ష విశేషించి యుండెను. బౌద్ధశ్రమణు
లును, భిక్షులును, మఠములయందును విహారములయందును
వాసము చేయుచు శిష్యులకు విద్యాదానమును జేయుచుండి

రి. వర్తమానకాలమునందువలె స్కూళ్ళున్ను, కాలేజీలును, ఎలిమెంటరీపాఠశాలలు నప్పుడు లేవు. బుద్ధధర్మప్రధాన మగు బర్మాదేశమునం దిప్పటికిని భిక్షులు దాము మందిరముల యందుండి విద్యార్థులకు విద్యాదానము చేయుచున్నారు. అశోకసామ్రాజ్యమున నసంఖ్యాకము లగుమఠములును విహారములు నుండెను. కేవలము మతబోధకును, విద్యాశిక్షకును గావలసిన్ని సదుపాయము లాకాలమునం దుండె నని చెప్పుట కెంతమాత్రమును సందేహము లేదు. సకలదేశములయందును సకలసమయములయందును విశేషజనపదములలో విద్యాశిక్షణవిషయమున సుప్రసిద్ధములై యుండుస్థానములు కొన్నిమాత్రమే యుండును. ఇంగ్లాండునకు లండనుప్రధాననగరమే యైనను నది విద్యావిషయమునమాత్రము ప్రసిద్ధ మైనది కాదు; ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి యనునవి విద్యావిషయమునఁ బ్రధానములు. భారతవర్షమునం దిప్పటికిని వారాణసి, పూనా, నవద్వీపము మొదలగుస్థానములు సంస్కృతవిద్యాశిక్షకుఁ బ్రసిద్ధములై యున్నవి. (అశోకునికాలమున రాజగృహసమీపమునందున్న నలాందాయును, పశ్చిమోత్తరభాగమునందున్న తక్షశిలయును విద్యాస్థానములందుఁ బ్రధానములై యుండెను. అశోకమహారాజు నలాందాయందు విద్యార్థుల కుపయోగముగా నుండుకొఱకు ననేకగృహములను గట్టించి యిచ్చెను. అందు విద్యార్థులపోషణమునకుఁ దగిన యుపవృత్తులను సమృద్ధములుగ నమకూర్చి యుండెను. అశో

కుఁడు స్వయముగ విద్యాపోషణకార్యములయందు సముత్సాహియై యుండెను. ఆతనిరాజ్యమున విద్యలకును, విద్వాంసులకును బరమాదరమున్నదని చెప్పనక్కఱలేదు. విద్యార్థులకు విద్యాలాభము సర్వసులభముగ నుండెనని చెప్పుటలో వింత యేమున్నది?

శ్రమణులును భిక్షువులు నే కాక మఱియొకతరగతివారివలనఁగూడ నాకాలమున లోకశిక్షావిషయమున విశేషసాహాయ్యము లభియించుచుండెను. వారే పరివ్రాజకులు. పరివ్రాజకులు సంవత్సరమునకెనిమిదిమాసములు గ్రామగ్రామమునకును నగరనగరమునకును దిరుగుచుండెడివారు; ఆ స్థలములయందు విజ్ఞానపరిపూర్ణంబులగు నుపదేశముల జేయుచుండెడివారు. వీరిశిక్షాపద్ధతులయందొకవిశేషమున్నది. వీరు ముందుగ దమ్ము దర్శించినవారితో సంభాషించుట కారంభింతురు. పిమ్మట నేదేనొకవిషయమును దీసికొని యందలితత్త్వమును విస్పష్టముగఁ బ్రబోధించుచుందురు. ఇందువలన జనసాధారణమున కంతకును విజ్ఞానలాభము కలుగుచుండెను. జనసంఘమున జ్ఞానము విస్తరిల్లుచుండెను పరివ్రాజకులయందుఁ బ్రజలందఱును విశేషముగ భక్తిశ్రద్ధలు కలిగియుండిరి. ఇట్టివారు నివసించుటకును బ్రజలకు బోధించుటకును ధనికులగువారు గ్రామములయందును నగరములయందును బ్రశాంతమంటపములను గట్టించియుండిరి. ఇట్టిమంటపములను గట్టించుట విం

గులఁ బుణ్యమనియు, ధర్మమనియుఁ బ్రతిష్ఠాకరమనియు నప్ప టివారు తలంచుచుండిరి. శ్రావస్తీనగరమున రాణి యగుమల్లికచేఁ బ్రతిష్ఠింపఁబడినవాఁటవ మిట్టపరివ్రాజకుల యుపయోగముకొఱకే యుపయోగింపఁబడియెను. వైశాలీనగరోపకంఠమునం గలసుప్రసిద్ధంబును, మనోహరంబును నగు చంపకవన మిట్టిపరివ్రాజకగణంబులకొఱకే ప్రతిష్ఠింపఁబడియెను.

పరివ్రాజకసంప్రదాయమున స్త్రీలుగూడ లోకశిక్షణమునకు సాహాయ్యపడుచుండిరి. పరివ్రాజికలును, బరివ్రాజకులు నప్పటి సన్యాసినీసన్యాసులంబోలెఁ గఠోరవ్రతపరాయణులు గాకపోయినను వారు చిరకాలమువఱకు బ్రహ్మచర్యవ్రతమును స్వీకరించుచుండిరి. విజ్ఞానమయులగువీరి యుపదేశములను గ్రహించుటకు గ్రామగ్రామములయందు ననేకసభలు గావింపఁబడుచుండెను. ఆసభలకు బ్రాహ్మణపండితులును బరివ్రాజకులును గూడఁ బిలువఁబడుచుండిరి. సభయందలి యుపన్యాసములు ముగిసినతరువాత సమాగతులగు ప్రజలయుపయోగముకొఱకు నానాశాస్త్రచర్చలు జరగుచుండెను. పెద్దపెద్దపల్లెలలో నిట్టిసభలు విశేషముగ జరుగుచుండెను. పరివ్రాజకు లిట్టిచోటికిఁ దఱచుగ వచ్చుచుఁ బోవుచుండిరి. బౌద్ధభారతేతిహాసమును బట్టి యాలోచింపఁగా నాకాలమున గ్రామోపకంఠములను, రాజపథపార్శ్వములను బుణ్యక్షేత్రములను నివసించుటకుఁ బరివ్రాజకులకును, సా

ధువులకును, సన్యాసులకును దగి ప్రశాంతములగు గృహములును, మంటపములును నిర్మింపఁబడి యున్నట్లు స్పష్టపడుచున్నది. ఇందువలన జనసామాన్యమునకంతకును జ్ఞానశక్తి, మతప్రవృత్తి, సాధుభక్తి మొదలగునవి యుత్తరోత్తరాభివృద్ధినందుట కవకాశము కలిగియుండెను. ఈ కారణముఁబట్టి యాకాలపుఁ బ్రజలు క్షేమముగా నుండిరనియు, విద్యావంతులై యుండిరనియుఁ జెప్పుట కెంతమాత్రమును సందేహము లేదు.

---

## ఇరువదియేడవప్రకరణము.

---

### ప్రజావస్థ

భారతవర్షము చిరకాలమునుండి విశేషించి పల్లెలే ప్రధానముగాఁ గలదేశము. ఇప్పటి బ్రిటిషుభారతవర్షమున నెన్నినగరములు, నుపనగరములు గలిగి నాగరికసంఖ్య యతిశయించియున్నను జాలభాగము పల్లెలుగా నుండుటయేగాక జనసంఘమునం దధికాంశజనులు పల్లెలయందే యున్నారు. అశోకుని రాజ్యకాలమున, పల్లీసమాజమే ప్రధానముగా నుండెను. పల్లెలయందలి గ్రామ్యులశోభాసాధ్యమున నన్నవస్త్రములకును జలమునకును బాధలేకుండ నాఁకలిదప్పికలను మాట యెఱుంగక శీతాతపబాధలకు లోఁబడక స్వస్థచిత్తులై యారోగ్యవంతులై ప్రజలెల్లరునుదమతమ యిష్టసుఖంబుల

ననుభవించుచుఁగాలముగడపుకొనుచుండిరి. మాటిమాటికిని వారుతమలోఁదాముకలహించి రాజద్వారమునకుఁదగవులకై పోవుటలేదు. పల్లెటూరివారందఱును దామెన్నుకొనినయొక పెద్దమనుష్యుమూలమునదమతగవులనుదీర్చికొనుచుండిరి. గ్రామమునందలి ప్రజలందఱును దమ చిన్నపెద్దతగవుల నాపెద్దకే నివేదించుచుండిరి. ప్రజలందఱును సంఘమునకు భయపడుచుండిరి. దేశమునందలి మతధర్మముల వారెన్నఁడు నుల్లంఘించుట లేదు. వారు సామాజికనీతిపద్ధతులకు విరుద్ధముగ సంచరించుట కెంతమాత్రము నిష్టపడెడువారు కారు. ఈసర్వవిషయములయందును సమాజశాసనము లుండెను.

"ధనము" అన్నంతమాత్రమున నిప్పుడు, నోటు, కంపెనీపత్రము, మొహరీ, రూపాయ, వజ్రము, ముత్యము, బంగారము, వెండి మొదలగునవి మనకు జ్ఞప్తికి వచ్చును. ఇప్పుడు రైలు, స్టీమరు మొదలగువానిసాహాయ్యమున సరకులను దేశవిదేశములకుఁ దీసికొనిపోవుటకు సౌకర్యము లున్నవి. బ్యాంకి నోటు, చీటి, హుండీ, బంగారము, రూపాయలు మొదలగువాని ప్రచారమువలనఁ గ్రయవిక్రయములకు విశేషముగ నదుపాయములున్నవి. వర్తకప్రచారము కూడ విచ్చలవిడిగ జరుగుచున్నది. పూర్వకాలమునందుఁ గృషికుఁడు తనయాహారపదార్థములను మాత్రము విక్రయింపక కేవలము ప్రత్తి, నార మొదలగువానినిమాత్రము విక్రయించుచుండెడివాఁడు. ఆతనికి వానిమూలముననే విశేష

మూల్యము లభియించుచుండెడిది. అట్టి విశేషవ్యాపారముల వలననే యనేకులు ధనవంతులగుచుండిరి. ఇప్పుడు వర్తకమునందుఁ గ్రయవిక్రయములకు సదుపాయములుండుటచే వర్తకులును గృషికులుఁ గొందఱును ధనికు లగుచుండిరి. ఈకారణముచే ధనము పల్లెలయందేమి, నగరములయందేమి కొంతమంది యొద్దమాత్రమే నిలువఁబడి పోవుచు న్నది.

అశోకుని కాలమునందుమాత్ర మిట్టి క్రయవిక్రయ వ్యాపారము దేశవిదేశములయందు జరుపుకొనుటకు సౌకర్యములు లేవు. కేవలము పల్లెలయందు ధనవంతులు లేనేలేరు. ఆ కాలమునఁ గేవలము ధనికుఁడును లేఁడు; దరిద్రుఁడును లేఁడు. గృహస్థులు గోధనమునే మహాధనముగఁ జూచుకొనుచుండెడివారు. ప్రతిగ్రామమునందును వ్యవసాయము చేయుటకున్నంత భూమికిని సమానముగ గోభూమికూడ నుండెడిది పల్లెలయందుఁ బశువులు లేనిగృహస్థు లెవ్వరునులేరు. సామాన్యకృషికునకైనను గూలిపని చేయుట యవమానకరముగ నుండెడిది. ఆ కాలమునఁ బల్లెలయందు ఋణము లేనివాఁడును, దేశాంతరమునకుఁ బోనివాఁడును శాకాన్నభోజియును సుఖజీవనులుగఁ బరిగణింపఁబడుచుండెడివారు.

చరిత్రమునందశోకయుగమున స్థాపత్యశిల్పరచనవిశేషముగ నున్నట్లు గానవచ్చుచున్నది. అప్పటిస్తూపములును, స్తంభములును, సౌధములును గూడ నిప్పుడు భగ్నములైయున్నవి. ఆ భగ్నావశేషములు గాంచుటచేతనే మనకు మహాశ్చ

లు మొదలగువానిలెక్కలును, విదేశీయుల నివాసములు, వారిస్థితిగతులు మొదలగువాని లెక్కలు, వైద్యశాలా స్థాపనములు, పరిచారములు మొదలగువాని విషయమున నెల్లవిధముల ననుకూలములగు నేర్పాటులు గావింపఁబడియుండెను.

పల్లెలయందును నగరములయందు నశోకునిధర్మశాసనమున నెట్టికష్టములును లేక జనులు సుఖముగ నివసించుచుండిరి. అశోకుఁడు తన యైహికాముష్మిక సుఖాభివృద్ధికై కావలసిన కార్యముల నన్నిటిని సంపూర్ణముగఁ గావించెను. అతఁడు రాజనామమునకుఁ దగియుండెను. ప్రజారంజనమే యాతని పరమధర్మము. ఆతఁడు ప్రజలను బిడ్డలవలెఁ బాలించుచుండెను. ఇట్టిసద్గుణములచే నశోకుఁడు రఘుమహారాజుతో సమానుఁడని చెప్పుట కెంతయుఁ దగియుండెను.

× × × × ×

"నపితాపితరస్తాసాం కేవలం జన్మహేతవః"

ప్రజావత్సలుఁడగుప్రభువే ధన్యుఁడు. అట్టిరాజుచేఁ బరిపాలింపఁబడుదేశమే పుణ్యమయమైనది. అట్టిరాజును సేవించుచు నాతనిదేశమున వసియించుచున్న ప్రజలసౌభాగ్యమే భాగ్యము.

---

## ఇరువదియొకటవప్రకరణము.

### శాసనప్రణాళి.

అశోకసార్వభౌముని శాసనప్రణాళిక యతిసుందరమైనది. ఆతనివిశాలసామ్రాజ్యమున వివిధప్రదేశములయం

చు వివిధరీతుల శాసనము లుపయోగపడుచుండెను. ప్రత్యే
కప్రదేశములయందొక్కొక్క రాజప్రతినిధి శాసించుచుం
డెను. రాజకుమారులుగాని, రాజబంధులుగాని, యోగ్య
పురుషులుగాని యాయాప్రదేశముల శాసనకర్తలగుచుండిరి.
ప్రాదేశిక శాసనకర్తల యధీనమున నొక యధికారి
యుండి యిట్టికార్యములఁ జేయుచుండును. ఆయుద్యోగ మిప్ప
టికమీషనరుల యుద్యోగమువంటిది. ఆయుద్యోగికి రా
జూకుఁడని పేరు. ఆట్టి రాజూకుని చేతిక్రింద "ప్రాదేశికుఁడు"
కార్యముల నిర్వహించుచుండును. ఆయుద్యోగ మిప్పటిజిల్లా
మేజస్ట్రేటు పదవివంటిది. ప్రాదేశికులక్రింద "యుక్తుఁడు"
"ఉపయుక్తుఁడు" అను నుద్యోగులుందురు. మిగిలినయుద్యో
గులు యథాయోగ్యముగ లెక్కలవిషయమునను గచేరీవ్య
వహారములయందును నియోగింపఁబడి యుందురు. అప్పటి
చిల్లరయుద్యోగులకు లేఖకులని పేరు. రాజధానియందలి
యెల్ల లెక్కలను దెలియఁజేయుటకిప్పటి "సెక్రిటేరియేట్"
వలె నొకగొప్పకచేరి యున్నది.

"రాజానశ్చారచక్షుషః" అను మాట మనదేశమున
మిగులవాడుకలో నున్నది. అట్టిగుప్తచారు లశోకుని రాజ్య
మునందుఁగూడ నున్నారు. అందుఁ బ్రధానగూఢచారులకు
"ప్రతివేదకు"లని పేరు. వారెల్లప్పుడును జాడికాలయము మొద
లు వేశ్యాలయములవఱకును గుప్తచరులై యుందురు. ఉన్నత
స్థితియందున్న వేశ్యాగణము కూడ వార్తాసంగ్రహణమునఁ

బని చేయుచుండెను. రాజ్యశాసనముకొఱకును, రాజునకును రాజ్యమునకును విపక్షులగువారిని నిగ్రహించుటకును, ప్రజా ధర్మమును, నీతిని బరిపాలించుచు వారియున్నతికిఁ దగుపద్ధతుల నాలోచించుటకును దగినకట్టుదిట్టములు చేయఁబడి యుండెను. క్రీస్తురాజ్యమునందన్యాన్యవిభాగములందును మతి మొక్కరీతినే యెల్లు వ్యాపించియున్నదియో యశోకునిరాజ్యమునందుఁగూడ నట్లే వ్యాపించియుండెను. ఇట్టిమతవిభాగ కార్యములనుగూర్చి తెలిసికొనఁదలఁచినచో “ధర్మమహామాత్రు” డను పేరుగల మతప్రవర్తకుని యుల్లేఖనములను జదువవలయును.

మహారాజగు ధర్మాశోకుని రాజ్యమున యుద్ధవిగ్రహములు లేవు. కాని యాతని సైన్యవిభాగముమాత్రము ప్రబలమై యుండెను. ఆతఁడు నగరశాసనవిషయంబునం జేసినయుద్యోగవిభాగమునందలెనే సైన్యశాసనవిషయంబునఁగూడ నాఱుశాఖలుగా విభజించెను. ఆతనిబలవిభాగమున నౌకాసేన, పదాతిసేన, అశ్వసేన, రథసేన, గజసేన మొదలగు నాఱుశాఖలు కలవు. వీనిమూలమున రణసామగ్రులను బంపుట, రససంగ్రహము, వస్తుసంచయపరిమాణము మొదలగు కార్యములు నిర్వహింపఁబడుచుండెను. రాజ్యమునందలి యంతర్విద్రోహముల నడఁగించుటకేమి, బహిశ్శత్రువు లాక్రమింపకుండ రాజ్యమును గాపాడుటకేమి మహారాజగు నశోకుఁడు తనబలమును విభాగించి యాశాఖల మూలమున సర్వ

సంరక్షణమునకును సదుపాయములఁ గావించియుండెను.

సకలవిషయములను బాగుగ విమర్శించిచూడఁగా మహారాజగు నశోకుని కాలమున రాజ్యశాసనపద్ధతు లన్నియు నాకాలమునకు సర్వవిధముల నుపయోగకరములయి సర్వసంపూర్ణములై యుండెను.

---

## ఇరువదితొమ్మిదవప్రకరణము.

---

### ధర్మమంగళము

అశోకసార్వభౌముని కాలమున బౌద్ధమతము రాజునకును ప్రజలకునుగూడఁ బరమాదరణీయముగా నుండెను. రాజునకును ప్రజలకునుగూడ నొక్కటేమత మగుటవలన రాజునకును, ప్రజలకును, మతమునకునుగూడ సర్వశ్రేయములును లభియింపఁగలవు. అశోకుని రాజ్యమున నట్టిభాగ్యము లభియించినది. అశోకుఁడు తనప్రజల యైహికసుఖసమృద్ధులకొఱ కెంతవఱకుఁ బ్రయత్నించిపనిచేసినదియు నిదివఱకే విశేషించి చెప్పియున్నాము. కాని యశోకుఁడు తనప్రజ లందఱు నైహికసుఖసంపన్నులై యుండిరన్నంతమాత్రమునఁ దృప్తివహించి యుండలేదు. ఆతఁడు తన ప్రజలయాముష్మికసుఖంబునకై యుపయోగపడుధర్మము, నీతి మొదలగువాని రక్షణమునకై కావలసినకార్యముల నన్నిటిని జేసెను. ఆతఁడు

తనప్రజలలో బౌద్ధధర్మానుష్ఠాన మెంతనియమముగ నడచు చున్నదో పరీక్షించుటకు ధర్మోద్యోగులను గొందఱను ని యోగించి యుండెను. యూరపుఖండమునందలి క్రీస్తురాజ్య ములలో మతపరివర్తనమునకై ప్రత్యేకకార్యనిర్వాహకులు నియమింపఁబడియుందురు. ఇంగ్లీషురాజ్యమున నిట్టిపనికై ఆర్చిబిషప్, బిషప్. చ్యాపలేన్ మొదలగువారున్నట్లు మన కుఁ దెలియవచ్చుచున్నది. ఇట్టివారుకూడ రాజ్యపాలనో ద్యోగవిభాగములయం దొక తరగతివిభాగోద్యోగులై యు న్నారు. వీరు క్రీస్తుప్రజలలోని మతాచారముల యనుష్ఠాన ములంగూర్చి విచారణచేయుచుందురు. మహారాజగు నశో కుని రాజ్యమునందుఁగూడ నిట్టియేర్పాటు లున్నవి. ధర్మమ హామాత్రుఁడు, స్థయిర్యమహామాత్యుఁడు, కర్మికుఁడు మొ దలగు రాజకర్మచారులవ్రాఁతలనుబట్టి యిప్పటికిని ధర్మాశో కుని రాజ్యపాలనేతిహాసమును మనము సంపూర్ణముగ గ్ర హింపవచ్చును.

బౌద్ధధర్మమున జాతిభేదము లేకుండుటచే సర్వదేశ ములయదుంను, సర్వజనులయందు నీమముము వ్యాపించుట కవకాశము కలిగెను. మహారాజగు నశోకుఁడు బుద్ధదేవుని ధర్మమును, నాతని శాంత్యుపదేశములను సర్వత్ర వ్యాపింపఁ జేయుటకై నానాదేశములకు బుద్ధమతప్రచారకులను బంపిం చుచుండెను. ఏయేదేశముల కెవ్వరెవ్వరు మతప్రచారార్థ ము పంపఁబడిరో యావిషయ మీక్రిందిపట్టికలో వివరింపఁ బడియున్నది.

(1) కాశ్మీరము, గాంధారము—మజ్ఝిమాస్తికుఁడు.
(2) మహిషమండలము— మహాదేవుఁడు.
(3) వనవాసీ— రక్షితుఁడు.
(4) అపరాంత— ధర్మరక్షితుఁడు.
(5) మహారాష్ట్ర— మహాధర్మరక్షితుఁడు.
(6) యవనలోక—(గ్రీసు) మహారక్షితుఁడు.
(7) హిమవంత— మజ్ఝిమ, మధురభిసారుఁడు, మహాదేవుఁడు, మాలవదేవుఁడు.
(8) సువర్ణభూమి— సోనుఁడు, ఉత్తరుఁడు.
(9) సింహళ— మహేంద్రుఁడు, సంఘమిత్ర.

ఈపట్టికం జూచినచో నశోకసార్వభౌముని ప్రభావ మెంతవఱకు వ్యాపించినదియుఁ దెలియగలదు. గాంధార (కాందహార) మప్పు డాతని రాజ్యమునకుఁ జేరియుండెను. అంతదూరమునం దున్న గాంధారమునుగూడ నతిక్రమించి యాతని మతప్రచారకులు యవన (గ్రీస్) దేశముకూడఁ బోయియుండిరి. మఱియు దక్షిణసముద్రమును దాటి సింహళమున మహేంద్రుఁడును, నాతని సోదరి యగు సంఘమిత్రయును మతప్రచారము గావించియుండిరి. మహారాజగు నశోకుఁ డెట్టిశ్రద్ధతోఁ బ్రయత్నించి బౌద్ధమతప్రచారమును గావించియుండెనో యట్టిపూనికతో భారతవర్షమునం దేరాజును నే మతమును బ్రచారితము గావించియుండలేదు. మతపవిత్రతా సంరక్షణముకొఱకు, మతప్రచారముకొఱకు మతస్థిరత్వము

కొఱకు సర్వవిధములఁ బ్రయత్నించుటచేఁ బ్రియదర్శి యనఁదగు నశోకుని నామము సర్వజగచ్చరిత్రమునందును జిరస్మరణీయమై విలసిల్లుచున్నది. ప్రకాశించుచున్నది.

---

## ముప్పదియవ ప్రకరణము.

### భూతదయ.

అహింసయే పరమధర్మమను మాట యశోకుఁడు పుట్టుటకుఁ బూర్వము చాల కాలముక్రిందటినుండియే భారతవర్షమునఁ బ్రచారమునందున్నది. అయినను వేదవిహితయజ్ఞయాగాదులయందును, దేవతామహోత్సవములయందును, లెక్కలేనన్ని జీవములు హింసింపఁబడుచునే యుండెను. మానవభోజనాదులయందంతకంటెను నధికముగ జీవహింస లగుచుండెను. భగవానుఁడగు బుద్ధదేవుఁడును, తీర్థంకర మహావీరస్వామియును జేసిన మహోపదేశప్రయత్నములవలన నట్టి జీవహింసలు చాలవఱకుఁ దగ్గిపోయెను. అహింసయే పరమ ధర్మమనుమాట వారిమూలముననే సర్వసామాన్యముగ నందఱకు బోధపడియెను. ఆకాలమునుండియే జీవహింస తగ్గుట కారంభమయ్యెను. ఎట్టిజీవికైన నెట్టియనిష్టమునైనఁ జేయకుండుట యహింస యనియు, సర్వజీవులను బ్రేమించుచు సర్వజీవులకును హితసాధనము లంగావించుట సర్వభూతద

యయనియు సర్వసాధారణముగఁ దెలిసిపోయెను.

మహారాజగు నశోకుఁడు సర్వభూతముల క్షేమము కొఱకును గావించిన యేర్పాటులను గూర్చి పరిశీలించినచో "నహింస" "భూతదయ" అనువాని విభేదము స్పష్టముగ బోధపడఁగలదు. ప్రజారంజనము చేయువాఁడే రాజు. ప్రజారంజనము చేయుటయే రాజత్వమునకు ముఖ్యోద్దేశము. ఈ పద్ధతియం దశోక సార్వభౌముఁడు సర్వవిధముల నాదర్శప్రభుఁడై యుండెను. ప్రజారంజనమునకై యాతఁడు చేయని కార్యమేదియును లేదు. ప్రజారంజనము చేయుటమాత్రముచే నాతఁడు నిశ్చింతుఁడై యుండలేదు. ఆతని ప్రేమామృతపవిత్రప్రవాహము పశుపక్షికీటపతంగపర్యంతమును బ్రవహించి యుండెను. అవి కూడ నాతని ప్రేమరాజ్యమునఁ బ్రజలై యుండెను. వానిని రక్షించుటయు పోషించుటయుఁగూడ నవశ్యకర్తవ్యమే యని యాలోచించి ప్రేమాశోక సార్వభౌముఁ డావిషయమునఁగూడఁ దన రాజ్యమునం దనేకవిధములగు శాసనములను బ్రకటించి యుండెను. అట్టిశాసనముల లోఁ గొన్నిటిని మాత్రము క్రింద లిఖించుచున్నారము.

"ఇంతటినుండి నారాజ్యమునందెచ్చటను నీక్రిందిజీవులను హింసింపఁగూడదు:— చిలుక, గోరవంక, చక్రవాకము, రాజహంస, గింజలనేరికొనితినుపక్షులు— పికిలిపిట్ట, కూర్మము, శల్కరమత్స్యము, వానరము, ఆఁబోతు, ఖడ్గమృగము, పావురము, గువ్వ, పిచ్చుక, ఆఁడుమేక, ఆఁడు

పంది, గర్భిణి, దుగ్ధపతి, గాడిద, గుఱ్ఱము, గోవు— మొదలగునవి¹ అశోకుని శాసనములను బట్టిచూడఁగా నాషాఢపూర్ణిమ మొదలు కార్తికపూర్ణిమవఱకును, మఱియు నితరమాసములయందలి విశేషనిర్దిష్టదినములయందును, మత్స్యవధయు, మత్స్యవిక్రయమునుగూడ నిషిద్ధములై యుండెను. ఇట్లు నిషేధించి శాసించుటచేఁగూడ నాతఁడు తృప్తుఁడై యుండలేదు. జీవజంతువులు నివసించుటకును జీవించుటకును గూడ ననేకఫలవృక్షములుగల తోఁటలనుగూడ నిర్మించెను. దేశమునందంతటను జికిత్సాలయములఁ గట్టించెను². రెండువేలసంవత్సరములకుఁ దరువాత నిప్పుడు మనము జీవక్లేశనివారిణీసభలను స్థాపించి యప్పుడప్పుడు పశుపక్షిమత్స్యాదులను హింసించుటదోషమని నిషేధించుచు నచ్చటచ్చటఁ బశుచికిత్సాలయములను స్థాపించుటచేతమాత్రమే మనము నాగరికులమనియు, గౌరవాన్వితుల మనియు భావించుకొనుచున్నారము! కాని యశోకునిచరిత్రమును బఠించినచో నెంతయో పూర్వకాలముననే మన భారతవర్షమునం దిట్టిసౌకర్యములు విశేషించి విధాయకాచరణమునందుండె నని బోధపడఁగలదు—అప్పుడు మనహృదయము శ్రద్ధాప్రశంసావిస్మయపరిపూర్ణము కాఁగలదు!!

Society for prevention of cruelty to animals



# ముప్పదియొకటవ ప్రకరణము.

---

## ఆత్మమంగళము

ప్రియదర్శుఁడగు నశోకుఁడు తన విశాలరాజ్యము నందలి శాంతికొఱకును, నందలియసంఖ్యాకప్రజాగణహిత సాధనముకొఱకును, భగవానుఁడగు బుద్ధదేవుని శాంతిమత ప్రచారముకొఱకును, పశుపక్షికీటాది సర్వప్రాణిని రక్షణము కొఱకును దనజీవితమంతయు వినియోగించి యథానుకూలములగు నేర్పాటులను గావించియుండెను. ఇట్టిసకలసత్కార్యములను శ్రద్ధతోఁ గావించుచున్న యాతనికిఁ గ్రమముగ వార్ధక్యము తటస్థించెను. పరమేశ్వరుని విచిత్రవిధానములచే జీవితకాలమునందలి సంధ్యాసమయము శాంతిమయముగా నుండునదృష్ట మెవ్వరికోగాని లభియింపదు. పుణ్యశ్లోకుఁడగు నశోకుఁడు కూడ నీకఠోరనియమము నతిక్రమింపఁజాలక పోయెను.

మహారాజగు నశోకునకు రాణులు చాలమంది యుండిరి. అందఱిలోనను 'తిష్యరక్షిత' యను రాణి యాతని జీవితమునందలి నానాదుఃఖములకును గారణభూతురాలయ్యెను. ఆమె తంత్రము వలననే యువరాజగు కుణాలుఁడంధుఁ డయ్యెను. తిష్యరక్షిత కుటిలహృదయయు, దుశ్చరిత్రయు నై యుండెను. రాజాంతఃపురమున నిట్టి కాలసర్పిణియు, రాజ్య

మాన కీర్తియంధుఁడగు భావిమహారాజునుదటస్థించుటచే నప్పటి యాతనిహృదయభావ మెటుండునో యూహించుకొన్నచో సులభముగనే బోధపడఁగలదు! ఇట్టిసమయమునందే యాతనిప్రియసహోదరుఁడగు వీతాశోకుఁడు కాలవశమునచే రోగయాభీషన్ని రీతులలోఁబడి మరణించెను. ఇట్టియనివార్యసంఘటనములచే మహారాజగు నశోకుఁడు విషణ్ణుఁడైపోయెను. అందుచే నాతనికి సంసారమున విరక్తి కలిగెను. అంతటినుండి యాతఁడు రాజర్షివలె సంసారబంధమును ద్రెంచికొని కాల్లయాపనము గావించుచుండెను. కుణాలుని యభావనీయదుర్దశచే నాతనిపౌత్రుఁడగు సంపాది రాజ్యమునకు యువరాజయ్యెను. అప్పుడు ప్రియదర్శి యగు నశోకుఁడు నామమాత్రమున రాజై యుండెను. యువరాజగు సంపాది మంత్రి మొదలగు రాజోద్యోగులపైఁ గనుమిక్కిలిగను జూపుచు రాజ్యమంతయుఁ దానే పాలించుచుండెను. అశోకమహారాజు ధర్మచింతచే ధర్మకర్మలతోడను బుణ్యపరిసంగముల తోడను గాలక్షేపము చేసికొనుచుండెను.

ఒకనాఁ డశోకసార్వభౌముఁడుపగుప్తునివలన నఖిల ధర్మములు నాలకించుచు "మహాత్మా! భగవానుఁడగు బుద్ధదేవుని మతాభివృద్ధికొఱకై యేపుణ్యాత్ముఁడు ఎక్కువధనమును దానముచేసి యుండెనో సెలవీయవలయు" నని ప్రశ్నించెను. అందుపై నుపగుప్తుఁడు "మహారాజా! శ్రావస్తీనగరవాసి యగు ననాథపిండదుఁ డను శ్రేష్ఠియొక్కఁడే

యావిషయమున నందఱకంటెను విశేషముగ ద్రవ్యదానము
ను జేసియున్నాఁడు' అని చెప్పి యాఁతఁడు చేసినదానముల
నన్నిటిని విస్పష్టముగ వివరించెను. ఆమాటలు విని యశో
కుఁడు 'నేనావిషయమున నూఱుకోట్లసువర్ణముద్రల దాన
ము చేయుదును; ఇంతకుఁ బూర్వమే తొంబదియాఱుకోట్ల
ముద్రలను వినియోగించితిని; ఇఁకఁ దక్కిననాలుగుకోట్లము
ద్రలనుగూడ వెచ్చించెదను' అని చెప్పి యంతటినుండి య
శోకుఁడు ప్రతిదినమును దనయాహారానంతరమునఁ దనస్వ
ర్ణభోజనపాత్రమును బౌద్ధసంఘమునకుఁ బంపివైచుచుండెను.
ఇంతియకాక యనేకవిధముల దానములను గావించుచుండె
ను. క్రమముగ నీసంగతి యువరాజునకును గర్ణగోచరమ
య్యెను. ఈవిధముగ మహారాజు దానముచేయుచుండినచో
రాజకోశ మచిరకాలములోనే శూన్యము కాఁగలదని యా
తఁ డూహించుకొనియెను. పిమ్మట నాతఁడు మహారాజునకు
స్వర్ణభోజనపాత్రను బంపుట మాన్పించి బంపునట్లాజ్ఞాపించె
ను; తుదకదియును లేకుండఁజేసెను. ఆసంగతి యంతయును
సంపూర్ణముగ గ్రహించి సార్వభౌముఁడగు నశోకుఁడు మ
హాశ్రవతుఁడయ్యెను.

ఒకనాఁడు మహారాజు ప్రేమాశోకముల విషణ్ణభావము
తోఁ గూర్చుండియుండఁగా మంత్రియగు రాధాగుప్తుఁడు
వచ్చి యాతనియవస్థఁ జూచి కృతాంజలియై 'మహారాజా!
ఈవిధముగ విచారాయత్తులై యుంటిరేల?' అని ప్రశ్నించె

ను. అందుపై మహారాజు "రాధాగుప్తా! నాకుఁ గోశముపై నధికారము లేదు. ఈవిశాలరాజ్యమునకు రాజరాజేశ్వరుఁడ నైయున్నను నాకోర్కె నెరవేరు గతి లేకుండఁ బోయినది! నాకోరిక తీరినది కాదు! నేను బౌద్ధసంఘమునకీయఁదలఁచిన శతకోటిస్వర్ణములను నీయ జాలకపోయితిని— వృద్ధుఁడనై యున్న నేనిప్పు డేమిచేయఁగలను? బుద్ధిపిముక్కుఁడ నగుట కు సాధన మేమున్నది?—ఇదిగో! నాయొద్ద నొక్కయుసిరిక కాయమాత్ర మున్నది! మంత్రిశేఖరా! నీవీ యామలక మును దీసికొనిపోయి కుక్కుటారామమునందున్న బౌద్ధసంఘమున కర్పింపుము! అచ్చటనున్న పూజ్యులగు మహాత్ముల కందఱకు నిదియే యశోకుని తుదిదాన మని నివేదింపుము! అందఱును దయతో దీనిని బరిగ్రహించి సమముగ విభజించుకొనవలయునని నేను ప్రార్థించినట్లు వారితో వచింపు ము!" అని చెప్పెను.

ఇట్లుచెప్పి మంత్రి కామామలకము నిచ్చుచు నశోక సార్వభౌముఁ డొక దానశాసనమును వ్రాయించెను. మహా రాజగు నశోకుఁ డీదానపత్రమున సముద్రమేఖలావృతం బగు నాతని విశాల రాజ్యమంతయును బౌద్ధసంఘమునకు దానము చేసినైచెను. ఆసమయమునందే యాతఁడు తన యాత్మమంగళమునకై యీవిధముగఁ బ్రార్థించెను.

"నేనిప్పుడు నారాజకోశముకాక తక్కినరత్నరత్నాకరపరిశోభిత విశాలరాజ్య మంతయును భగవానుఁడగు బుద్ధ

దేవుని భక్తసంఘమునకు దానముచేసివైచితిని—ఈదానము నకుఁబ్రతిఫలముగ నేనెట్టిసుఖమును గోరుకొనుట లేదు—ఇంద్రాధిపత్యము నభిలషింపలేదు. బ్రహ్మలోకమును వాంఛింపలేదు. ఇవియన్నియును నలినీదళగతజలచంచలములు! క్షణభంగురములు!—చిత్తపరిశుద్ధిని గోరి—దృఢవిశ్వాసము నభిలషించి—ఆత్మసంయమలాభమును వాంఛించి నేనీదానముం గావించితిని—ఇదియే నాయాత్మమంగళము!!"

ఇట్టిప్రార్థనమును బ్రకటించి యశోకసార్వభౌముఁ డాతని సర్వస్వమును త్యజించివైచెను. ఆముహూర్తమునందే యాతఁడు తిరోహితుఁడైపోయెను.

---

## నందనము.

అనంతసాగరవక్షమున సంపూర్ణజ్యోతిర్మయసూర్యమండలముం బోలి / యనంతకాలసముద్రమున మహిమాన్వితమహారాజసార్వభౌముఁ డగు నశోకుఁ డంతర్హితుఁడైపోయెను. మహాపురుషు లందఱికంటెను మహాపురుషుఁడు!

రెండువేల సంవత్సరములు గడచిపోయినవి. కాలప్రవాహమునం దెన్నియోకీర్తిచిత్రములు భగ్నములైపోయినవి—తేలిపోయినవి. ఓమహారాజా! ఓభారతగౌరవమూర్తీ! నీకీర్తిచిత్రములుమాత్ర మెన్నినాశనములై పోలేదు!

కాని యశశ్శరీరిణియగు వానికిమాత్రము నాశనములేదు! ఓ సార్వభౌమా! ధర్మాశోకా! నీవిశాలకీర్తికీర్తనములను, నీవిశాలరాజ్యసుఖశాసనకథాప్రతిధ్వనులలో మేమిప్పటికిని వినుచునే యున్నారము! పరమపావనశోభాభాసమానంబగు నీపాటలీపుత్ర మిప్పు డెక్కడ నున్నది? నయనాభిరామంబగు నీకుక్కుటారామం బిప్పు డేమైపోయినది? ఆసాంచిస్తూపమగపడ దేమి?—ఆగుహామందిర మేది? కాలతరంగకఠోరాఘాతములచే నందిప్పుడు కొన్ని లుప్తములైపోయినవి! కొన్ని భగ్నములయిపోయినవి? కొన్నివికృతములయిపోయినవి! కాని యంతటిఘనప్రతిష్ఠాపనములం గావించిననీహృదయమునందలి శాశ్వతశుభోద్దేశమును నీపూర్వకథాభారతీప్రసాదముచే మేమిప్పటికిని మా క్షుద్రకుటీరములయందుండియే యాకర్ణించుచు నానందపులకాంకితవిగ్రహులమై వెంటనే యవనతమస్తకులమై నీరాజ్యలక్ష్మికి సహస్రశతసహస్రాభివాదనములం గావించుచున్నారము!!

ఓరాజచూడామణీ! నీప్రజలమైహికాముష్మికసుఖసమృద్ధులం గూర్చియు, నీసర్వసుఖశాసనములంగూర్చియు, నీశిష్టశిక్షణదుష్టపరిపాలనతత్పరతంగూర్చియు, నీరాజ్యసుఖశాంతిస్థాపనములంగూర్చియు, నీసర్వభూతదయాళుత్వముం గూర్చియు నిప్పటికిని భారతవర్షమునందలి దూరనగగిరిగహ్వరములయందుఁగూడఁ బ్రతిధ్వనులు బయలుదేరుచున్నవి.

ఓకీర్తిభూషణా! రాజర్షీ! నీవుచేసిన సత్కార్యముల
—బుద్ధదేవుని శాంతిమతప్రచారమునకు నీవుచేసిన సాకర్య
ములకు— సాగరమేఖలావలయితంబగు సర్వరాజ్యప్రదాన
మునకుఁ బ్రతిఫలముగ నీవెట్టిసుఖమును గోరలేదు. ఇంద్ర
త్వము కోరలేదు. బ్రహ్మత్వము కోరలేదు. కేవలము స్వధ
ర్మమున దృఢవిశ్వాసమును, జిత్తశుద్ధియు, వాఙ్మనసంయమ
మునుమాత్రమే నీవు కోరుకొంటివి. పరమేశ్వరానుగ్రహ
మున నీవాంఛితము సంపూర్ణముగ ఫలియించినది!

ఓరాజర్షీ! జరామరణాతీతంబగు నేలోకమునం దిప్పు
డు నీవుంటివో యాలోకమునుండి నీకృపామృతకటాక్షముల
నొకసారి నీప్రియభారతవర్షముపైఁ బ్రసరింపఁజేయుము! ఓ
శాంతిప్రియా! నీభారతవర్షము చిరశాంతసౌభాగ్యవిరాజితం
బగునట్లుగ నాశీర్వదింపుము!

ఓప్రియదర్శనా! నీపవిత్రచరిత్రము —నీరాజ్యపాల
నచాతుర్యము—నీరాజ్యవిస్తారము, భారతవర్షమునందలి ప్ర
జలకందఱకుఁ జిరకాలమాదర్శకమై విరాజిల్లుచుండుఁగాక!

A. S. Narayana
Govt. Training School
Ellore

—



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA101BST75 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 23-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |